


వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత. ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికీ ఆత్మబంధువు లాటిది.




## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళ నాడుకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

---





త్వరలో విడుదల కానున్న జెమినీవారి మహత్తర హిందీ సాంఘికచిత్రం 'పైగాన్'లో
వైజయంతిమాల, దిలీప్ కుమార్‌లు నటించిన మధురసన్నివేశం





జెమినీ వారి హిందీ చిత్రం 'పైగాన్' (సందేశం)లో
వైజయంతిమాల, వసుంధరాదేవి




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# భిక్షుక సమస్యా పరిష్కారము



అపరిష్కృత సమస్యలలో భిక్షుకసమస్య యొకటి. ఈ సమస్యా పరిష్కారంలో గల సాధక బాధకాలు అనేకం. వంశపారంపర్యంగా భిక్షాటనమునకే అలవాటుపడి దానినే జీవనోపాధిగాగల వర్గాలు యింకా యుండటం చాలశోచనీయము. దేశకాల పరిస్థితులు మారడంతో బాటు ఉన్న అవకాశాలను వినియోగించుకొని ఏదో కృషి చేసి జీవయాత్ర సాగించడము ముమ్మాటికి మేలుకాగలదు. దానధర్మములపట్ల సయిత ప్రజల దృక్పథము మారినదని, కృషిచేసి జీవయాత్రసాగించకలిగి కూడ భిక్షాటనమును జీవనోపాధిగా అంటిపెట్టుకొని యున్నవారు గుర్తించాలి.

ఇక వికలాంగులు, అనాధలు సయితము భిక్షాటనమునకు పూనుకోడంకంటె వారి శక్తి సామర్థ్యాల ననుసరించి ఏదైనా కృషిచేసికొని జీవయాత్ర సాగించడానికి

గల మార్గాలను అన్వేషించాలి. అందుకుగాను ప్రభుత్వమువారుగాని, స్థానిక స్వపరిపాలనా సంస్థలుకాని ఏర్పాటుచేసిన భిక్షుకగృహాలను వికలాంగులు, అనాథలు వినియోగించుకోవాలి. అట్టి గృహాలు ఏర్పడికూడ వారు వానిలో ప్రవేశించనిచో చట్టబద్ధంగా వారు బలవంతంగానైనా అట్టి గృహాలకు పంపబడాలి.

దురలవాట్లకు, అవినీతికి అలవాటుపడి భిక్షాటనమునే అంటిపెట్టుకొనియుండాలని ప్రయత్నించే భిక్షగాండ్రను అదుపులో నుంచవలసియున్నది. ప్రజలమధ్యరచ్చరద్దితగ్గి జాతీయశ్రేయస్సు రూపొందుటకు భిక్షుకసమస్యా పరిష్కారంకూడ అత్యవసరమే. ఇందుకు ప్రజలు, ప్రభుత్వము సహకరించుటతోబాటు భిక్షుకగృహాల స్థాపనోద్దేశాలను బిచ్చగాండ్రు గుర్తించి వ్యవహరించాలి.



## అభ్యుదయ సాధన

అభ్యుదయ సాధన స్త్రీ పురుషుల ఏ ఒక్కరి కృషివల్లమాత్రం తృప్తికరముగా ఫలించదు. అందువల్లనే సంఘజీవితానికి పునాదియైన కుటుంబంలో పరస్పర సద్భావం, సహకారం, త్యాగం అవసరమని పెద్దలంటుంటారు. ఈ సందర్భమున ఆంధ్ర గవర్నర్ సతి శ్రీమతి సచార్ అన్నట్లు బాలికలు ఉన్నత విద్యను ఆర్జించుటతోబాటు గృహనిర్వహణ కార్యకలాపాలలో ప్రావీణ్యము సంపాదించుకోవాలి. వినయవిధేయతలు, సౌశీల్యము స్త్రీల సహజసంపద అయినా పురుషులు సయితము వానికి సమానంగా అలవడాలి. పురుషులు వానిని నిర్లక్ష్యముచేసినా, స్త్రీలు నిర్లక్ష్యముచేసినా కుటుంబజీవితము నరకతుల్యమయ్యే అవకాశములున్నవి. తమ ఉన్నతవిద్యనో, సంపదనో ఆధారంగా చేసికొని అధికార ఆధిపత్య వాంఛలతో స్త్రీ పురుషుల మధ్య కలతలు సంఘానికిగాని, కుటుంబానికిగాని, దేశానికిగాని క్షేమకరంకాదు. హృదయాలలో సేవాభావం, త్యాగం యీనాటి అవసరాలు.



# ఆత్మనివేదనము

సాహిత్యసరస్వతి శ్రీ సిరిపి ఆంజనేయులు

(ఫిబ్రవరి సంచిక తరువాయి)

5

ఆట బసిరెడ్డి కేడవ కోడలొప్పు
శైశవముననుండి సౌమ్యవృత్తులకుఁ
గుదురైనయింతి మేల్గానముల దొంతి
త్యాగసంశీల విద్యల కాలవాల
కపురంపు విరిగొమ్మ యపరంజిబొమ్మ
స్మరునిసుమ మ్మనఁజను ముసలమ్మ.

ఆమె సుచారిత్ర మతికీర్తనీయ
మౌదార్యమహితం బనన్యలభ్యంబు
తల్లిదండ్రుల యాజ్ఞ దైవాజ్ఞగాఁగఁ
దలఁచి పాటించుఁ; బెద్దల నెమ్మిఁగాంచు
గురుల సేవించు; భక్తులఁ బేర్మినెంచు; ;
చిఱుతలఁ బ్రేమించుఁ జెలుల మన్నించు;
ననుజీవివర్గమ్ము ననురక్తిఁ బెంచు;
స్వజనమ్ముల హార్దమ్మునించు.

మొలఁత వేఁగుంబోక మేల్కాని, నిత్య
శుచియయి, గృహపరిశుభ్రతకొఱకుఁ
దల్లికిఁ దోడ్పడి, తనదు చెల్లెండ్ర
కనువున స్నానపానాదు లమర్చి,
తదుపరిఁ బసుల మందకుఁ జేర్చివచ్చి,
చదువుసాగించు నొజ్జల భక్తిఁగాంచు.

కదురు కవ్వంబాడఁ గఱవుండదనెడు
నార్యోక్తి గుర్తించి యామృదులాంగి
లేఁగటియావుల లేఁగలఁ బెరిమఁ
జూచి, గానుగపిండి జొన్నవంటకము
ప్రత్తిగింజలతొక్కఁ బరితృప్తి నిడుచుఁ
బరువుల కదనునఁ బాడి పెంపొంద
మది ననిశమ్ము సమ్మద మందుచుండు.

జీవులఁ దన మేలిజీవంబు పోల్కి
నాత్మ నెంచెడు నా దయామయహృదయ
యాఁకొన్న దూడలు నావులుఁ దనకుఁ
గనఁబడునెడఁ, గనికరమునఁ గనుచుఁ
దవుడో యన్నంబో మెత్తని పచ్చికసవో
యిడి, కుడితిని బోసి యెంతయుఁ బొంగు.

ఒక్కొకవేళఁ దా నొంటిమై నింట
వసియించుతఱిఁ బలువంటకంబులను
వండి, చిఱుతల బీదవనితలఁ బిలిచి
వారి కాఁకలిదీఱ వడ్డించుచుండు.

పడఁతి సత్వరముగ బావులకడకుఁ
జల్దులు కొనిపోవు సమయమ్మునందు
నాఁకటిచిచ్చున నలజడిపడుచు
నెవ్వఁడే నెదుటఁ గాన్పింపఁ, గరంగి
నిలిచి, యాడలనుండు నిండుభారము
దిగిచి, యంబలి వానిఁ దృప్తుఁగావించి,
నడకసాగించు మానసముల్లసిల్ల.

వరిపొలమ్ములకుఁ గావలియుండు నెడల
నితరుల పసరమ్ము లెవియేని వచ్చి
పైరు పాడొనరింప బాధింపఁబోక,
ఆదరమ్మున నుపాయాంతరమ్మునను
వెడలించి వానిని, విడివడియుండు
పచ్చికబీళ్లలోపలఁ దోలి మేపు.

జొన్నతోఁటలలోన మిన్నందివెలయు
మంచెలపై నిల్చి, మందమారుతము
వలపున ముంగురు లల్లలనాడఁ,
జెఱఁ గొడికట్టునఁ జేర్చి బిగించి,
వీగవారిగఁ గనువిందయి తోఁచి,
కేల నొడిసెలను గిరగిరఁ ద్రిప్పి,
'హో' యని యఱచి, యా కోమలధ్వనికి
వాయువేగమ్మునఁ బఱచు పిచ్చుకలఁ
గనుఁగొని, డెందము కళవళపడఁగ
రాయి విసరలేక ఊపడి నిలుచు.

అనుపమంబైన ఘృణాన్విత చరిత
యించుక యలసత యెఱుఁగని నెలఁత
శ్రమ మిట్టి దంచు నెంచని క్షమాకలిత
ఉడుకువఁ గాంచని యూడిగమ్మునకుఁ
దనివియు ముదమును గను కార్యనిరత
తనపనిలో దైవము నెంచు వనిత
ఫలసిద్ధికై యాసపడఁబోని గరిత-
ముసలమ్మ, యొకనాఁడు మునిమాపుదనుకఁ
గందిచేలఁ గుదుళ్లఁ గలుపెడలించి,
యాఁగక రేఁగు నట్టాఁకలి నడఁప
చలిదిమూటను విప్పి సాపడఁబూనఁ
దనపాలమ్మునఁ బచ్చికను గోయువాని,

నలికిడి గుర్తించి యదరెడివానిఁ,
గొఱవ ✗ బాలుని గోనెఁ గొడవలిఁగొంచుఁ
గస వచ్చుటనె వీడి వెసఁ జనువాని,
నరిగొని – వీఁపున కంటెడు కడుపు
ఖిన్నమౌ మోము వీక్షించి కరంగి
గటికతో సిద్ధాన్న కబళం బొసంగి
యరిగె నింటికిఁ బ్రసన్నాస్యాబ్జయగుచు,

(సశేషము)

✗ కొఱవ బాలుఁడు = ఎఱుకు (కిరాతుఁడు.)

(147–వ పేజీ తరువాయి)

శ్రీ చిత్తూరు వి. నాగయ్య ఉపన్యసిస్తూ ఈ శ్రీరామనవమి పర్వదిన సందర్భమున తనకీ భగవన్నామము భక్తులమధ్య సంతోషకరమనియు, భక్తి విశ్వాసము లెల్లప్పుడూ మానవుని పూర్ణపురుషునిగా రూపొందించుచుండుననియు, శ్రీ సాయిబాబా స్వామీ కేశవయ్యజీ ద్వారా మానవకళ్యాణమును, శ్రేయస్సును సమకూరుస్తున్నాడని చెప్పిరి.

శ్రీ O. V. అలగేశన్ మాట్లాడుతూ మన దేశంలో దివ్యపురుషులకు లోటులేదనియు, వారి మార్గదర్శకత్వము మన కనుటిన జీవయాత్రలో అనేక విధముల నుపయోగపడుచున్నదనియు, భక్తివిశ్వాసములతో భగవంతుని శరణు వేడటం మనపంతైనా భక్తులు కష్టసుఖాలను సమానస్థాయిలో స్వీకరించి భగవదేచ్ఛకు బద్ధులు కావలెననియు, ఈ స్థల మాహాత్మ్యం, స్వామీజీ దివ్యత్వం అనేకులను ఆకర్షించి అనాధలకు, వ్యాధిగ్రస్తులకు ఆపదలో నున్నవారికి రక్షణ నిచ్చుచున్నవనిరి.

శ్రీ టి. చెంగల్వరాయ పిళ్లై వందనసమర్పణ చేయుచు శ్రీ అలగేశన్ ఉత్తములలో నొకరనియు, వారి అభ్యుదయ అభివృద్ధులు సహజంగా అభిలషించవలసినవనియు, వారు స్వామి కేశవయ్యజీ చెప్పినట్లు మంత్రి కాగలరనే ఆశిస్తున్నామనియు చెప్పి ఉత్సవములో పాల్గొని, ఉత్సవాన్ని జయప్రదముగునట్లు తోడ్పడినవారికి కృతజ్ఞతను తెలిపిరి. స్వామి కేశవయ్యజీ ఆయురారోగ్యములతో కలకాలము జీవించి భగవత్సేవ, మానవసేవ చేయడం మనకు క్షేమకరం. సాయిమందిర నిర్మాణం త్వరలో జరుగగలదన్నారు.

స్వామీజీ విభూది ప్రసాదములను పంచిపెట్టిరి. వడపప్పు లడ్డుండ ప్రసాదములు సయితము భక్తులకు పంచిన తర్వాత కార్యక్రమము ముగింపునకు వచ్చెను.

# సంపూర్ణావతరణము

బ్రహ్మశ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావు

(ఫిబ్రవరి సంచిక తరువాయి)

ఈ శీర్షిక క్రింద గత రెండు వ్యాసములతో "వేద వాఙ్మయములో స్త్రీలు", వీరిపై "అన్యమతముల ప్రభావము" అను విషయములగూర్చి కొంతవరకు చర్చించి, యట్టి పరిస్థితులలో మన నారీమణులు తిరిగి తమ స్వత్వమును బడయుటెట్లు? అను సమస్యయే యిప్పటి మన నారీలోక మెదుర్కొనవలసిన ముఖ్య సమస్య యని నుడివితిని. ఇందలి చిల్లర విషయములకు పోకపూర్వము అసలీకాలమున అవతరించవలసిన స్త్రీ స్వభావస్వరూపము లెట్లుండవలెనో లఘువుగ తెలుసుకొనుట యవసరము.

ఏ సమయమునందైనను ధర్మమునకు గ్లాని కలిగినప్పుడా పరమేశ్వరుడే యీ లోకమునందవతరించెదనని భగవద్గీతలలో ఆ భగవానుడే మనకెల్లరకు అభయము నొసంగెను.

"యదాయదాహి ధర్మస్య
గ్లానిర్భవతి భారత..."

లోగడ క్షత్రియాదులకు అధర్మము జరిగినప్పుడిచ్చట బుద్ధభగవాను డవతరించెను. ఆతడే కొంతవరకు యీ స్త్రీ సమస్యలను గూడ పరిష్కరింప యత్నించెను. కాని ఆ యత్నములు చిట్టచివరకు విఫలములైనవి. ఇటీవల మనదేశమందే కాక యావత్ప్రపంచమునందును యీ స్త్రీ స్వాతంత్ర్యము, స్త్రీ అభ్యుదయము, ఒక పెద్ద యుద్యమ రూపమునే ధరించుచున్నదని మనమెరుగుదుము — ఆస్తి హక్కులకై, విద్యాప్రవేశమునకై, సాంఘిక గౌరవమునకై, వోటింగు మున్నగు పౌర హక్కులకై, అన్నిటికంటె మిన్న మోక్షార్హతకై, ఆమెకు — స్త్రీకి - గల యర్హత — ఆమె సాధించవలసిన కృషి, యత్నముల గురించి అనేకచోట్ల అనేకులు సదా యోచించుచున్నారు - కొంతవరకు యత్నించుచున్నారు కూడను.

కాని యిప్పుడీ సమస్యా పరిష్కారమునకై చిన్న చిన్న యుద్యమములు, చిన్న చిన్న చికిత్సలు చాలవు. రుగ్మత బహుగాఢమైనది - మన మానవత్వములో బహులోతుగ వేళ్లు పాతుకొనిపోయిన జాడ్యము. మన రక్తమాంసములలోనే జీర్ణించినది. అట్టితరి యిచ్చటి సాంఘికవ్యవస్థ సక్రమముగ చక్కబడి, తిరిగి మన స్త్రీలకు తమ సహజస్వత్వములు లభించి, సంఘమందు సంపూర్ణ సామరస్యమేర్పడుటకిప్పుడిచ్చట కావలసినదొక మహావతరణమే - సంపూర్ణావతరణమే!

ఈ యవతరణము విశ్వమంతయు వ్యాపింపవలసి యుండుటచే, దీని రూపములనంతములైనను, యిందు ముఖ్యముగ రెండు అంశములగూర్చి మనము విపులముగ గ్రహించుట యవసరము. (1) పరిపూర్ణత్వము, (2) స్త్రీ పురుష సమన్వయ విషయము. ఈ రెండింటిలో యీ వ్యాసమందు యిప్పుడవతరించవలసిన స్త్రీలలోని పరిపూర్ణతగూర్చి కొలదిగ ప్రస్తావించెదను.

ఈ నారీలోకముగూర్చి ప్రస్తావించుచు, మన పూర్వులు పరాశక్తియొక్క అనంత రూపములను గుర్తించి, పేర్కొనిరి. వీనిలో సృష్టి, స్థితిలయముల కధిష్ఠాన దైవములగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు సహధర్మచారిణులుగ శ్రీ సరస్వతి, లక్ష్మి, శక్తులు మువ్వురను ఆదిమూర్తులుగ పెద్దలు గుర్తించియుండిరి. ఇంతవరకు వీరు ముగ్గురే మన నారీలోకమందలి "త్రిమూర్తు"లని చెప్పవచ్చును.

కాని యీ మువ్వురిలో గూడ సాధారణముగ మన స్త్రీలలో సరస్వతి అంతర్వాహినియైపోయినది. ఇందుకు వారికి విద్యావకాశములు తొలగింపబడుటయే చాలవరకు కారణము. ఇటులనే లక్ష్మీస్వరూపిణియగు స్త్రీకి ఆస్తి హక్కులే అంతరించిపోయినవి. శక్తిస్వరూపిణియగు స్త్రీ "అబల"యైపోయినది. ఆహా! ఎట్టి విడూరము? ఎట్టి కాలమార్పు?

ఆ విషయమెట్లున్నను, ముఖ్యముగ మన ఆంధ్ర సాంప్రదాయములలో యీ "త్రిమూర్తులను" మన

పెద్దలు గుర్తించి, ఆరాధించిరనుటకు మన భారత భాగవతములే సాక్షి. ఉదాహరణ: మహాభారత మందలి ఆది (ధ్యాన) శ్లోకమునందే "శ్రీ, వాణీ, గిరిజా" యని ఆ మహాగ్రంథమును ప్రారంభించినారు గ్రంథకర్తలు. ఇందు లక్ష్మికి ప్రథమస్థాన మిచ్చుట మన తెనుగు సంప్రదాయమే యని తోచును. ఇటులనే భాగవతమునందలి పరాశక్తి స్తుతిలో "అమ్మల గన్నయమ్మ - ముగురమ్మల మూలపుటమ్మ" యని మనము చదువుదుము. ఇందలి "ముగురమ్మలు" శ్రీ లక్ష్మి, సరస్వతీ, పార్వతులని మన మెరుగుదుము.

ఈ మువ్వురలో "శ్రీ", అనగా లక్ష్మి, ఆంధ్రుల అభిమాన దేవతయని నేను పైన నుడివితిని. ఇందలి విషయప్రాముఖ్యతచే దీనిగూర్చి యిచ్చట మరి కొంచెము విపులపరచుట యవసరము.

మంత్రశాస్త్రమునందలి పెక్కు బీజాక్షరములలో "ఓం", "శ్రీం", "ఐం" లను మూడును అతి ముఖ్యములనియు; ఇందు ఓంకారము జ్ఞానబీజ మనియు; శ్రీకారము శక్తి బీజమనియు; ఐంకారము లక్ష్మి బీజమనియు శాసించబడియున్నది. ఈ మూడింటిలో శ్రీకారమే ఆంధ్రులకు ఆరాధ్యబీజ మైనది. శ్రీకారముతో కవిత్వమును ప్రారంభించని కవి సుకవియే కాడని శాస్త్రము. ఇంతేకాక యిచ్చట మనవారిలో రాజ్యతృష్ణయు హెచ్చనియు; ఆంధ్రుల కొక "మహారాజ శ్రీ జాతి" యనియు మనకెల్లరకు నిత్యానుభవము.

ఈ శక్తి రూపములలోనే వివిధ వ్యక్తులకు వివిధ ఆరాధ్యదైవములు లేక ఇష్టదేవతలున్నటులే, భిన్న జాతులకును భిన్న ఆరాధ్య దేవతలుండుట సామాన్యానుభవము. ఉదా: బంగాళీయులకు కాళి ఉపాస్య దేవతయైనచో - ఆంధ్రులకు దుర్గయే జాతీయ దైవతముగ గన్పడును.

ఇందలి వివిధజాతుల అభిమాన దైవతముల విషయ మెటులున్నను, సరస్వతీ, లక్ష్మి, శక్తులు ముగ్గురును చిరకాలముగ యిచ్చట "త్రిమూర్తు"లుగ వెలసి రనుట స్పష్టము. కాని యిప్పుడు తిరిగి యొక నూతన జాతి సృష్టి — మానవసృష్టియే జరుగవలసియున్నందున ప్రస్తుత దేశకాల పరిస్థితులదృష్ట్యా యిప్పుడును యీ "త్రిమూర్తి" స్వరూపమే చాలునా ? లేక మరొక విస్తృతావతరణ మవసరమా ? అను సమస్యను మన మెదుర్కొనవలసి యున్నది.

ఈ కలికాలములో అన్ని మంత్రములలో కృష్ణా, కాళీ మంత్రములు రెండును అతిముఖ్యములని మంత్ర శాస్త్రము చెప్పుచున్నది. (కృతయుగమునందు శ్రుతి యనగా వేదమును, త్రేతాయుగమందు స్మృతులును, ద్వాపరమందు పురాణేతిహాసములును, కలియుగములో మంత్రశాస్త్రమును ప్రమాణములని శాస్త్రము). తదనుగుణముగ తన శిష్యవర్గమును యీ కృష్ణా—కాళీలీలలకు సంసిద్ధులుగ యొనర్చుటయే తన జీవితాశయమని యొకతూరి శ్రీ అరవిందులు వ్రాక్రుచ్చెను. అట్టితరి, భారతావనిలోనే గాక, యావత్ప్రపంచమునందును యుద్ధములు, సంఘర్షణలు, కలహములు, వైరములు, పోటీలు నానాటికి పెరిగి పోవుచున్న యీ కలియుగమునందు "కాళీ" యుపాసనను తృణీకరించుట యేజాతికైనను ఆత్మఘాతుకమే యగుననుట నిస్సంశయము.

అందుచేతనే కాబోలు "మదర్" అను తమ పొత్తములో శ్రీ అరవిందులు మాతృమూర్తి రూపము లనంతములనియు; కాని స్థూలముగ జెప్పవలసినచో అందు నాలుగు రూపములు బహుస్ఫుటముగ గాన్పించుననియు ఉల్లేఖించియున్నారు. మహాలక్ష్మి, మహాకాళీ, మహాసరస్వతీ, మహేశ్వరీ — అవే యీ నాల్గు రూపములని జ్ఞాపకము. ఇందు "మహా" శబ్దము విశేషణ రూపమైనందున మూలశక్తులను లక్ష్మి, కాళీ, సరస్వతీ, ఈశ్వరీలని మనము తేలికగ గ్రహింపగలము.

ఇందలి పురుషరూపములతో సంబంధములదృష్ట్యా పరిశీలించినచో యీ దిగువ హాంశములు స్పష్టమగు చున్నవి.

సృష్టికర్తయగు బ్రహ్మమూర్తి కనువగు స్త్రీ రూపము సరస్వతి.

స్థితికర్తయగు విష్ణుమూర్తి అర్ధాంగియే లక్ష్మి.
లయకర్త రుద్రుని ప్రేయసి శ్రీ కాళికాదేవి.

శాంతిప్రియుడు, శుభదాయకుడు నగు శివమూర్తికి యిష్టదేవత ఉమా లేక దుర్గ యని చెప్పవచ్చును.

ఆయా దైవములలో వివిధజాతులవారు, వివిధ ప్రాంతములవారు వివిధ రూపముల నారాధించుట సహజము — సామాన్యానుభవమునై యున్నది. ఉదా

హరణ : బంగాళీలు కాళీ, దుర్గాల నెక్కుడుగా ఆరాధింతురు - ఉత్కళులకు సుభద్ర యిష్టదేవత — యుద్ధమునకు సర్వదా సంసిద్ధులుగ నుండవలసిన పంజాబీయులకు చండికయే ప్రజారాజ్ఞిగ నగపడుటలో నబ్బురములేదు. మైసూరువారికి మహిషాసురమర్దనిగను, తమిళులకు రంగనాయకిగను యీమె అవతరించుచున్నది.

ఇట్టి సందర్భములలో ఏయేజాతుల కేయే రూపములు ఉపాస్యనీయములను విషయము కొంతవరకు విమర్శనీయమేయైనను, స్థలవిస్తరభీతిచే యిందలి లోతుపాంశముల గూర్చి యిచ్చట చర్చించబూనను. కాని యితర భారతీయ సంప్రదాయములను, యిచ్చటి మన ఆంధ్రాచారములను, ప్రపంచ పరిస్థితులను, అన్నిటిని పురస్కరించుకొని, యీ కాలమున, యిచ్చటి మన ఆంధ్రదేశమున కవసరమగు స్త్రీ రూపమెటులుండవలెనో మాత్రము చిత్రించి, అంతటితో యీ ప్రస్తావన ఆపుదును.

ఇచ్చటి మన స్త్రీలు చదువులలో సరస్వతులుగ నుండవలెననుట నిస్సంశయము. ఇది సర్వే సర్వత్రా అంగీకృతము - ఆచరణీయము.

ఇటులనే వీరు లక్ష్మియుతులు — అనగ ఐశ్వర్యవంతులు, లేక "ఆస్తిపరులు" కావలెననుటయు నిస్సంశయము.

ఒక్క ఆంధ్రులేకాక, యావద్భారతజాతియు వీరరసము నారాధింపవలసిన యీ కాలమందు మన నారీమణులు కొంతవరకైనను కాళీయుపాసన గడంగుటయు అవసరమే. ఎక్కడో యొకరిద్దరు సత్యభామ, రుద్రమదేవి, ఝాన్సీలక్ష్మిలు మాత్రమే చాలరు. ఇప్పటి మన నారీలోకమెక్కుడుగ వీరనారీత్వము నారాధించుట ప్రధానకర్తవ్యమే.

ఇక. శేషించిన శాంత్యభ్యుదయ మార్గములో — వివరములను విడచిపెట్టి - దుర్గయే ఆంధ్రుల ఆరాధ్యదేవతయని మనము చెప్పవచ్చును.

అందుచేత శ్రీ సరస్వతి, లక్ష్మి, కాళి, దుర్గా రూపమే యిప్పుడిచ్చట అవతరించవలసిన — మన నారీలోక మవలంబించవలసిన — సంపూర్ణ ఉపాస్యరూపము - ఇదియే యిచ్చట అవతరించవలసిన స్త్రీమూర్తి స్వరూపము. కాని యీ నాల్గును పరాప్రకృతికి నాలుగు ముఖ్యరూపములే యైనను ఆమె నాలుగే రూపములని మాత్రము మనము భావించకూడదు. ఏలయన ఆమె రూపము లనంతములు. అన్నదాత యగునప్పుడామె అన్నపూర్ణ - వరములిచ్చునపుడామె వరదాదేవి యగుచున్నది. యుద్ధములు చేయునప్పుడామె "యుద్ధమధ్యస్థా"యు, రాజ్యముల నలుపట్ల "రాజ్యదా - రాజ్యవర్ధినీ"యు, నరులకు నరకబాధలను తప్పించుటలో "నరకార్ణవతారిణి"యు, "భవబంధమోచని"యు, దేశారిష్టములపట్ల "దేశోపద్రవనాశిని" ఇటులనే-యీమె వేనోళ్ల చాటబడుచున్నది.

మన దేశమందలి వివిధ స్తుతి, స్తోత్రములలో, లక్ష్మీ సహస్రనామములనియు, గాయత్రీ సహస్రనామములనియు, వివిధ స్తోత్రములున్నవి. ఆ స్తోత్రనామములన్నియు మనము శ్రద్ధగ బరిశీలించినచో యీ పరాశక్తియొక్క అనంతరూపములలో కొన్నిరూపములను మనము గ్రహింపవీలగును. ఇవన్నియు యీమె రూపములే - యీమె లీలలే - సందేహములేదు. కాని వీటినన్నిటిని సామాన్య మానవకోటి యెల్లరును, యెల్లకాలములందును, పఠించి, జపించి, ఆరాధించి, అనుభవించుట కష్టసాధ్యమగుటచే, యీ అన్ని రూపములనుండి మన నిత్యజీవితమున కనుగుణ్యముగ పైజెప్పిన నాల్గు రూపములు ముఖ్యములనియు యీ రూపములలో యీ "మాతృమూర్తి"ని తేలికగా సాధింప సాధ్యమగుననియు, అందుచే మానవకోటికి యీ నాలుగు రూపములను ముఖ్యముగా ఆరాధ్య దైవతములనియు పెద్దలు చెప్పుదురు. కాని యిందలి "సంపూర్ణావతరణ" స్వరూపము నెఱుంగగోరువారు కనీసమొక్క సహస్రనామ స్తోత్రమునైనను శ్రద్ధగ పఠించి, జపించి, సాధించుట అవసరమని నొక్కివక్కాణించుచున్నాను.

ఇక యీప్రస్తావనను శ్రీ గాయత్రీ హృదయమునందలి యీ దిగువ శ్లోకములతో ముగించెద :—

విరాడ్రూపాం మహాదేవీం గాయత్రీం వేదమాతరమ్।
ధ్యాత్వాతస్యాస్త్వథాంగేషు ధ్యాయేదేతాశ్చ
దేవతాః॥
పిండబ్రహ్మాండయోరైక్యాద్భావయేత్స్వాత
నౌతథా।
నిజరూపం నిజేదేహే తన్మయత్వాయ సాధకః॥



# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: **Dr. W. రాధాకృష్ణయ్య**

(గతసంచిక తరువాయి)



పై కథను వినుటవలన, నవీన మానవసంఘమునకు జాలిపుట్టక తప్పదు. ఇతర తల్లికి జన్మించిన బాలుడు, జన్మమువలన బ్రాహ్మణుడు కాడు. అతని పేరు మహీదాసుడు. అనగా భూ పుత్రుడు. ఆ ఇతరతల్లి, ఇతర అనుటవలన బ్రాహ్మణ స్త్రీ కాదని స్థిరమగుచున్నది — కుమ్మర జాతికి చేరినదని, ఊహించనగును. భూదేవి ఆమెకు ఇష్టదేవత యని తెలియుచున్నది. ఆమె నేలపైబడి రోదనముచేయుట, తల్లియొడిలో మొరపెట్టుకొనుటగా నున్నది. శూద్ర స్త్రీయందు బ్రాహ్మణునికి జన్మించిన బాలుడు, శూద్రులకన్న హీనజాతియని, పంచముణ్ణని దేశాచారము నిర్ణయించుచున్నది. సంఘమునగల ఇట్టి అన్యాయమువలన కలుగు అగౌరవమును, ఈ మహీదాసుడు ప్రత్యక్షముగ ననుభవించెను. ఆనాటి కాలమున ఇట్టి విపరీతములుండెనా యను సంశయము మనకు కలుగవచ్చును. కాని, నేటి కాలమున ఇట్టి అవినీతులకు మితము లేదనుటలో సంశయములేదు. ఈ ఇతిహాసమునందు మనము వెదుకవలసినది, సంఘమునందలి అవనీతులు కాదు. దీనియందలి సత్యాంశమును వెదుకవలెను. ఒక బ్రాహ్మణబీజము, సత్వాంశ సంభూతమైయుండుట వలన, ఒక కార్మికవంశమున, పరిశ్రమ, పట్టుదల యను గుణములు గల శోణితమున - అనగా, చెమట కారునట్లు కష్టపడియైన, కాసంతసుఖము, సౌకర్యము కోరు గుణములు గల వంశమున, సమ్మేళన పొందినచో, ఉన్నతోత్తమ జ్ఞానశిఖరమును చేరుటకు, పరిపూర్ణ బ్రహ్మ పదవి యనబడు వేదాంత సాక్షాత్కారము పొందుటకు యోగ్యత కలుగుచున్నది. మరియు, ఎట్టి జాతియందు జన్మించియుండినను, సనాతన ధర్మ సూత్రముల రీతి, ప్రతి జీవియు, జన్మించినపుడు శూద్రుడుగనే, యెన్నబడుచున్నాడు. సంస్కారము వలన ద్విజుడగుచున్నాడు. తదనంతరము, తీవ్రపట్టుదల, సాహసము, సాధనవలన, కళానైపుణ్యము పొంది, ఉపనిషత్తులు తెలుపు పరిపూర్ణ బ్రహ్మపదవిని, వ్యక్తి పొందగలుగుచున్నాడు. బ్రహ్మ నెరిగిన వాడు నిజమైన బ్రాహ్మణుడనబడును.

కనుక, మిత్రులారా! ఈ ఉపనిషత్తును పఠించుటలో, అనేక ఉపమానములు, కుమ్మరివారి జీవితము నుండి కనుబరచుటలో, ఆశ్చర్యపడవలసిన ప్రమాదము లేదు. వాటివలన, ఈ ఉపనిషత్తు సామాన్య మానవుని శ్రుతియని, కార్మికుల బైబులు కూలివారి ఖురాను అని తెలియనగును. ఐతరేయుడు బ్రహ్మ పదవి పొందగలిగెను. అతని యుపనిషత్తు కార్మికుల వాడనుంచి గ్రహించబడిన హిందువుల కళాంశమని తెలియవలెను.

మహీదాసుడు తనకు కలిగిన అగౌరవమును తీవ్రముగ అనుభవించెను. తత్ప్రతీకారముగ అతడు తండ్రిని నిందించలేదు. తల్లిని పాడుపుమాటలతో కష్టించలేదు. తన స్వపరిశ్రమవలన, బ్రహ్మవిద్య — ఆత్మవిద్య — బడయగలిగెను. ప్రపంచమునకు తన లాభమును పంచిపెట్టెను. ఉపనిషద్రూపమున బోధించెను. ఇందొక గొప్పసమస్య, విచారము చేయనబడుచున్నది. "భూమిపై జన్మించినందుకు ప్రపంచమునకు నీవు చేయగలిగిన సేవ ఏమి?" ఈ ప్రశ్న ఒక్క మనిషికి కాదు, ఒక జాతికి కాదు, ఒక సంఘమునకు కాదు, ప్రతి మానవుడు తన్ను తాను ప్రశ్నించుకొనవలసిన సమస్య. పశువులవలె పుట్టుట చచ్చుటకొరకు అని మానవుడు తృప్తి నొందకూడదు. మానవునికి బుద్ధి, వివేకము కూడి యున్నవి. తానెవరో తెలిసికొనవలెను. ఎచ్చటనుండి తాను వచ్చెను? ఎచ్చటికి పోవలెను? తన గమ్యస్థానమేమి? తన గమ్యస్థానమునకు, తన పరిస్థితికిగల వ్యత్యాసమేమి? తాను ముందుకు అభివృద్ధి పొందుచున్నాడా? లేక వెనుకకుజారి, పశుసమానుడగుచున్నాడా? తన జన్మహక్కును పొందుటకు మార్గమేమి? చక్కని మార్గమేది? సమీప మార్గమేది? నమ్మకమైన మార్గమేది?

ఒక కుమ్మరి పిల్లవాడు, తాను పరిపూర్ణదశ పొందినవెనుక, ఈ సమస్యలకు సమాధానము బోధించి యున్నాడు. కనుక ఇది కార్మికుల శ్రుతి విచారము. సంఘమున కష్టసుఖముల ననుభవించినవారి విచారము. భాగ్యవంతుల భేదముకాదు. చక్రవర్తుల వేదాంతము కాదు.

ఈ గొప్ప ఉపనిషత్తునందు, శాంతి పాఠముతో చేరి, ఆరుభాగములున్నవి. దీనికి అత్మిపక్కమని శంకరులు పేరిడిరి. ఇందు శాశ్వత చైతన్యసత్యమును, అభివ్యక్త దృశ్య ప్రపంచముగ, ప్రపంచ చైతన్యమ్ముగ, తెలుపబడుచున్నది. ఆరోప, అపవాదమనబడు శైలి నిందుపయోగింపబడియున్నది. అనగా, లేని సామ్యమును ఆరోపించి, (కల్పించి) మరల దానిని నిరసనము చేయుట క్రిముల పరీక్షించుటయందు, క్రిములు పరుచబడియుండు అద్దపు ముక్కకు వర్ణములను జతపరచి, వర్ణములకు వ్యతిరేకముగనుండు క్రిములను దర్శించునట్టి ఉపాయము. ఒక సజీవబీజమును గమనించి, పరీక్షించుటలో దాని పరిమాణము, ఆకారము, దానియందలి అణువుల నిర్మాణక్రమము తెలుసుకొనుటకు, ఆబీజము నొక గ్లాసుయొక్క పైస్థాపించి, అనేక రంగుల వర్ణములను దానిపై పారింతురు. అవి ఎండిన వెనుక అద్దపు ముక్కను దుర్భిణిక్రిందనుంచి, గమనింతురు. బీజమున కెట్టి వర్ణము లేనందున, రంగులమధ్య బీజాకారము స్పష్టముగ, దృగ్గోచరమగును. దర్శించు శాస్త్రజ్ఞుడు వర్ణముల నెల్ల చూచుచుండినను, ఇవన్నియు సహాయార్థమందుపయోగింపబడినవి. ఈ వర్ణములకు వ్యతిరేకముగ, జీవిబీజము కనబడుచున్నదని, యెంచుచున్నాడు. అదేవిధముగ, ఆరోపమనగా సమీపమునందుండు వస్తువునుచూపి, దూరపు వస్తువుకు తెలుపుట. "బ్రహ్మసత్యం. జగన్మిథ్య." భగవంతుడొకడే సత్యము, యమున, సృష్టి క్రమమొకటి కల్పించి, ఆ సృష్టియంతయు, పరబ్రహ్మముగ కలిగెను అని తెలిపి, మరల అట్టి సృష్టిని నిరసించి సృష్టియనుట కల్ల, దృశ్యమంతయు బ్రహ్మస్వరూపము, బ్రహ్మేతరమినుమంతయు లేదని, తీర్మానించబడుచున్నది. ఇది ఆరోపము. ఆపవాదము. భ్రమచెందినవానికి భూతమును చూచునపుడు, స్థాణువుయొక్క ఊహయుండుటలేదు. భూతము యొక్క వికార చేష్టలను సూక్ష్మముగ గమనించుటవలన, భూతము తొలగి, స్థాణువు సులభముగ దృగ్గోచరమగుచున్నది. ఇది విచారము యొక్క ప్రారంభము. విచారము చేయవలెను. విషయమును కనుగొనవలెను. విచారమువలన, ప్రపంచము, ప్రపంచమున కాధారముగనుండు పరబ్రహ్మము, కూడ ప్రత్యక్షము కాగలదు.

పాశ్చాత్యమిత్రులు కొందరు, సంస్కృతభాషను కొద్దిగ నభ్యసించి, వేదాంత నిపుణులమని ప్రేలజొచ్చిరి. హిందువుల భాగ్యమగు, శాశ్వత ఉపనిషత్ జ్ఞానమును, గ్రాహ్యము చేసుకొన ప్రయత్నించిరి. చివరకు, దిక్కు తెలియక, మతిభ్రష్టులై, ఎగబోసుకొనజొచ్చిరి. అంతటితో, యూరకుండక, భరతఖండపు ఋషివాక్యములు జ్ఞానసూక్ష్మములైనను, వీటిని నమ్మరాదు. ప్రపంచసృష్టిని గురించి, ఒకరు తెలుపునట్లొకరు తెలుపుటలేదు. ఈ ఉపనిషత్తులందు దాదాపు ముప్పది మూడు రకముల సృష్టి సిద్ధాంతములు కనబడుచున్నవి. ఈ ఒక్క విషయమునుగురించి ఇరువురు కూడ ఏకభావము పొందలేకున్నారు. వారికి దృష్టి దోషముకలదని తీర్మానించిరి. పాపము వారికి జ్ఞానదృష్టియనిన, విజ్ఞానమనిన యేమిటో తెలియని దోషమిది.

ఒక గదిలో నొక ప్రకృతి శాస్త్రజ్ఞుడు, ఒక కవి ఒక చక్రవర్తి, ఒక గాయక శిఖామణి, ఒక అమాయక ప్రాకృదుడు, అందరు గాఢముగ నిద్రబోవుచుండిరి. నిద్రయందు, సుషుప్తావస్థయందు వారందరనుభవించు ఆనంద మొక్కరీతిగనున్నది. కాని, వారు నిద్రనుండి లేచిన వెనుక, వారి సుషుప్తానుభవముల వర్ణించమనిన చో, వారు వివిధరీతుల వర్ణించగలరు. శ్రద్ధావంతుడగు సాధకుడు వారు పలుకు మాటలందు వ్యత్యాసములను కనుగొనినను, వారి అభిప్రాయములవలన సుషుప్తియందలి ఆనందమేకరీతిగనున్నదని తెలుపుట గమనించగలడు.

అదేవిధమున, మహాత్ములు ధ్యానసమాధియందు దేహమనోబుద్ధుల ప్రజ్ఞనతిక్రమించి, శుద్ధమగు ఎఱుకయందు, బ్రహ్మానంద మనుభవించుచున్నారు. అట్టి బ్రహ్మానందానుభవకాలమున శాశ్వత చైతన్యశక్తి యొకటే వారి ఎఱుకనందున్నది. వారు మరల దేహభావమునకు దిగివచ్చి, తమ బ్రహ్మానందానుభవమును వర్ణించవలసినచో, సహజముగ ఒక మహాత్మునికి, మరొక మహాత్మునికి, ఒక ఋషికి, మరొక ఋషికి, ఒక అవతారపురుషునికి, మరొక అవతార పురుషునికి, మాటలందు వారి వారి పూర్వమనోబుద్ధుల వాసనల రీతి, భేదము కనబడగలదు.

నిజముగ, అట్టి మహాత్ములకు ప్రపంచము సృష్టించబడినదనిగాని, ఇదొక కార్యమనిగాని, తెలియుటలేదు.

వివిధ వ్యత్యాసములతో కనబడు ప్రపంచ దృశ్యమంతయు, చూచుకరణములగు మనోబుద్ధులందుగల దోషము. వారి నాశ్రయించిన శిష్యులకట్టి క్రొత్త సిద్ధాంతములనుగాని, తెలుపవలెనని వారు కోరుట లేదు. శిష్యులకు సమ్యక్ జ్ఞానము లేనందున, దృశ్యములందలి వ్యత్యాసములను వారు తొలగజేయుచున్నారు. తొలుతనే "పరబ్రహ్మ మొకటియే యుండనది. ప్రపంచమనునది లేదు." అనినచో, వారు దిక్కు తెలియక పారిపోగలరు. శిష్యులకుండిన అజ్ఞానమును తొలగించి, జ్ఞానమార్గమున దారిచూపుటే గురువుల ముఖ్యోద్దేశము. తొలుత ప్రపంచమునగల దుఃఖముల వాటి నివారణకుగల ఉపాయముల చర్చ ప్రారంభమగుచున్నది. నెమ్మదిగ, ఉన్నతాంతస్థులు చేరి ద్వంద్వ ప్రపంచము నతిక్రమించి, ప్రపంచకారణాంశమును చేరుచున్నారు. ప్రపంచమెట్లు పుట్టెను? ఎచ్చట ముగియును? అని విచారించి, కడకు ప్రపంచాతీత విషయమును విచారించుచున్నారు. ఇందలి శైలి అత్యద్భుతము. అపరిచితము. విశేషనైపుణ్యముకలది. ఈ తరమువారికి దీనిని నచ్చజెప్పుటకు వారి పరిచిత భాషతో పక్వముచేసి తెలుపుటత్యవసరము. వారియందు సానుభూతి కలిగి బోధించవలెను.

పూర్వకాలము, ఋషులు, ప్రతిశిష్యుని యోగ్యతను చక్కగ విమర్శించుచుండిరి. శాశ్వత, నిత్య, పరబ్రహ్మనుండి ఈ పరిమితిగల ప్రపంచమెట్లు సృష్టి పొందెను! అనుసిద్ధాంతమును, నానావిధ చమత్కారసవరణలతో వారికి నచ్చునట్లు తెలుపుచుండిరి. ప్రతి ప్రవచనమునందును, యొక స్వారశ్యము కల్పింపబడుట కనబడుచున్నది. అందువలన, వివిధరకపు శిష్యులకు గల మానసిక అశాంతి నివారణ పొందుచుండెను. కొంత శాంత చిత్తులయిన శిష్యులు తమ అంతరమున, "ఈ సృష్టి ఏలకలిగెను." అను విచారము స్వయముగ ప్రారంభింతురు. అపుడు ఋషి, వారికి ఉన్నత సత్య శాశ్వత పదవి వలన కలుగు సుఖమును తెలుపుచున్నారు. అందువలన వారి సంశయములు శాశ్వతముగ నివారణ పొందుచున్నవి. ఈ వివిధ సృష్టి సిద్ధాంతములు, శిష్యుని మానసిక అశాంతిని నివారించుటేగాక, నూతన విచారములకు అవకాశమొసగును.

ప్రతి సిద్ధాంతమునందును, ప్రవచన స్వారశ్య చాతుర్యమున, కొన్ని అంశములు వదలబడుచున్నవి. అట్లు కొన్ని అంశములు వదలబడినవని శ్రోతలు అనుమానించుటకుకూడ లేదు.

విచారము కొంతదూరము సాగిన వెనుక, వెంట నంటిరండని శిష్యులకు హెచ్చరిక చెప్పి గురువులు వారిని పర్వతములపైకి లోయలోనికి నదీతీరములకు వనప్రదేశములకు లాగుకొని వెళ్ళునట్లు, బోధసలిపి, ఒక్కపెట్టున గాఢాంధకార దట్టపుటడవిలో వదలి వారివారిబుద్ధికుశలతతో వెదకి, సత్యచైతన్యమును దారిని కనుగొనుడని, జారవిడుచును. శిష్యులా ప్రకృతి సౌందర్యములను చూచి, చకితులగుదురు. తామిదివరకు తలచుచుండిన సృష్టి, దానిక్రమము దాని సిద్ధాంతము. అంతయు ఎంతటి వెఱ్ఱితనమని విచారపడుదురు, సంశయముల కాస్పదము లేదని తెలియుచున్నది. తమ పూర్వసంశయములకు విలువలేకున్నదని "అకారణముగ నిట్టి సంశయముల పాలైతిమ"ని ఆశ్చర్యపడుదురు.

అపుడు శిష్యుల ముఖచిహ్నముల చూచి గురువు సంతసించును. వారి కృతజ్ఞతకానందించును. మాట్లాడకయే, కంటిచూపులతో "మాకేల ఇట్టి పిట్టకథలు తెలిపితిర"ని వారు గురువులను ప్రశ్నించుటకు "వేరు మార్గములేదు. మీకు రజించునట్లు సృష్టిక్రమమును కల్పించవలసివచ్చెను" అని సమాధానము పలుకును. శిష్యులు తమ అవివేకము నంగీకరించి క్షమాపణ వేడుదురు.

## 3. విచారము

ఒక వ్యక్తి సమాజమునందు కోరు శారీరక మానసిక, వైజ్ఞానిక సౌకర్యములనుబట్టి అతని వికాసము నిర్ణయించవచ్చును. ఒక కళాప్రపూర్ణుడు కోరు సౌకర్యము లధికముగ నుండును. ఒక అనాగరికుడు కోరు సౌకర్యము లతిస్వల్పము. అతడు తన దేహముపై నుండు మురికిని కూడ గమనించడు. ఆ మురికి నేల తొలగించవలెనని తలచును. కష్టపడి దేహమును శుభ్రపరచుటవలన లాభమేమి అనుకొనును. అతనికి ముఖ్యముగ ఆహారము, కప్పుకొనుటకు కొంతబట్ట, పండుకొనుటకు కొంత నీడ కావలెను. కొంత సంస్కారము పొందినవ్యక్తి, మంచి ఆహారమును కోరును. తాను కోరిన యాహారముచే పుచ్చుకొనును. బట్టల నేర్పరచుకొనును. కాని వసతిగృహముపై ఇంకను దృష్టిలేదు. కళాపరివర్తనము అభివృద్ధియగు కొలది సౌకర్యములు పెరుగుచుండును. ఇవి అసంస్కారులకు గోచరము కాదు.

ఒక పసిబిడ్డకు తినుట యొకటియే తెలియును. తన చేతికి దొరకిన ప్రతి వస్తువును నోటియందుంచుకొనును.

కొంత పెరిగిన వెనుక, దుస్తులు కోరును. ఇది నా పడక ఇది నా గది, ఇది మా ఇల్లు, అని చెప్పుకొనును. ఇట్లు సౌకర్యము లొకటొకటిగ పెరుగుచుండును. ఉన్నత అంతస్థు చేరిన విజ్ఞాన పురుషుడు రెక్కలు గల పక్షి వలె, అంతరిక్షమున ఎగిరిపోవనుద్యుక్తుడగును. అతడీ దేహసౌకర్యములతో సమ్మతింపడు. మనోవినోద ములతో తృప్తిపడడు. ప్రతివస్తువుయొక్క క్రమరీతు లను తెలిసికొనగోరును. "నేనెవడను? నేనెందుకు జన్మించితిని? ఇచ్చటేలయున్నాను? ఈ ప్రపంచమున కనబడు క్రమరీతు లెట్లు ఏర్పడెను? వీటిలో దృశ్యము లేవి? వీటికతీతముగనుండు అదృశ్యశక్తి ఏమి?"

ఒక పసిబాలునికి రెండు గోలిగుండ్లు దొరకినచో, దినమెల్ల ఆట్లాడుకొనుచు కాలము గడుపును. ఇతర చింతలతనికి లేవు. తన సోదరుడు ప్రక్కగదియందు పదార్థవిజ్ఞాన శాస్త్రముల, రసాయన శాస్త్రముల నేల చదువుచున్నాడని అతనికి విచారములేదు. తన తండ్రి అనుభవించు కష్టసుఖముల నతడూహించలేడు. ప్రపంచమున నిజమగు శాంతియున్నదని కనుగొనిన మహాత్ముల సంఖ్య అత్యల్పము. అట్టివారే ఈ ప్రపంచమును విచారించి తెలుసుకొనగలరు. "సృష్టియనగా నేమి? సృష్టియేలకలిగెను? సృష్టికర్త ఎవరు? ఎందుకు సృష్టించినాడు? ఈ సృష్టి క్రమమున విపరీతములు కనబడుటలేదు. దీనికి అంతములేదు. మానవుడు మహాయుద్ధముల ప్రారంభించుచున్నాడు గాని, వాటిని నివారించు శక్తి లేకున్నాడు. అదేవిధముగ భగవంతుడు కూడ ఈ సృష్టిని కలిగించెనుగాని, నివారించలేకున్నాడా? సృష్టించువానికే నివారించు శక్తిలేదా?" ఇట్టి ఆలోచనా విచారము కొంత విజ్ఞానపరివర్తనము కలిగిన వెనుక ప్రారంభమగును. సాధకుడు విషయములను కాదు, విషయములందుండు క్రమబద్ధములను గమనించును. విచారించును. మహాత్ముల సందర్శించును. తెలిసికొన ప్రయత్నించును. మనుష్యులేల జన్మించుచున్నారు? జన్మించిన వారేల మరణించుచున్నారు? కొందరు లేతవయస్సున పోవుటేల? కొందరు నూరేండ్లు మీరి జీవించుటేల? అదృశ్యశక్తి నుండి ఈ దృశ్యప్రపంచముత్పన్నమాయెను. చూచుచుండగనే ఇది మరీ అగమ్యగోచరమగు అవ్యక్తమున-మరణమను నెపముతో-లయమగుచున్నది - ఎందుకు?

ఈ బ్రహ్మాండమున కోటానకోటి జాతిభేదములు కనబడుచున్నవి. సూర్యుడు, చంద్రుడు, భూమి, వృక్షములు, జంతువులు, పక్షులు, క్రిములు, కీటకములు—ఎన్నిరకములో! అన్నియు జీవచైతన్య స్వరూపములుగ నున్నవి. ఇది యంతయు ఒక నాటకమా? ఒక వేడుక ప్రదర్శనమా? ఎవరికావేడుక? దీనివల్ల ఈ ప్రపంచమున కేమైన సుఖమున్నదా? ఈ బ్రహ్మాండ నాటకమున నాకుగల సంబంధమేమి? నా పాత్రయొక్క యోగ్యత ఏమి? ఇట్టి విచారములవలన అతడు కేవల భావావేశములతో తృప్తినొందుటలేదు.

ఇన్ని విషయముల నొకటొకటిగ, జ్ఞానసమ్మతముగ విశదీకరించి చెప్పగలిగినను, "ఆవలనుండు గోచరశక్తి ఏమి?" అని అతడు మరల ప్రశ్నించును. పండితులు సమాధానము తెలిపి అతని దాహమును తీర్చలేరు. అసలు, నిజమైన సమాధానము వారికి తెలియదు. ఇట్టి విచారమునకు సమాధానము తెలుపుట పండితుల సాధ్యముకాదు. గ్రంథములు తెలుపజాలవు. సజీవముతో నుండు శ్రోత్రియబ్రహ్మనిష్ఠుడగు గురువొకడు మాత్రము సమాధానము తెలుపగలిగియుండును. అట్టివారు పట్టణములలో గ్రామములలో దొరకరు. హిమాలయ పర్వత లోయలలో వారు దొరకగలరు. అట్టి గురువులను, సాధకుడు వినయవిధేయతలతో, సమిత్పాణియై, అన్వేషించ వెళ్ళవలెను. గురువు ఆత్మనిష్ఠయందు, బ్రహ్మానందమున తులతూగుచుండును. అతనికి కోరికలు లేవు. తనకు తానుగా పరిపూర్ణహృదయుడైయుండును.

గురువు తనాశ్రయించిన శిష్యుని కొంతకాలము గమనించుచుండును. శిష్యుని గుణవిశేషములు, దేహదారుఢ్యము, విజ్ఞానపరిపక్వమును గమనించును. బ్రహ్మవిద్య గ్రహించుటకు యోగ్యత అతనియందు కనబడినచో, అతనికి తగు సమాధానముల నిచ్చును. ప్రేమపూర్వకముగ, మర్యాదయుక్తముగ, గంభీరముగ, చర్చ ప్రారంభమగును. "నీ సంశయమేమి?" అని గురు ప్రశ్నించగా, శిష్యుడు నివేదించును. "ఈ సృష్టి ఏల కలిగెను. సృష్టి ఎట్లు కలిగెను? ఎన్నడు కలిగెను?

(సశేషము)



# లక్ష్మీ హ్రాదయము

శ్రీ అప్పలు, బి.ఏ.

"అంతగా నిద్ర పోవడం ఏంవిటి? పెద్దవారి దగ్గర భయం ఏమాత్రమూ లేదు నీకు."

"లేదండి కూర్చొనే ఉన్నా" అని కారు డ్రయివరు జవాబిచ్చాడు.

"కూర్చొని కునకక పోతే కారయినా కాస్త శుభ్రం చేయలేక పోయావా?" అన్నది గురల లక్ష్మి.

"తొందరగా పోవచ్చన్నారని గుడ్డ ముక్కలయినా తేలేదండి" అంటూ క్రిందికి దిగిపోయాడు.

"ఏదో నెపం చెప్పడం మాత్రం బాగా ఎరుగుదువు. తుడాలనుంటే తలగుడ్డ చాలదూ. మక్కువలేని మనువు లాగుంది నీ వాలకం" అని అన్న లక్ష్మి పలుకులకి కొంచెం తొందరగా, "అలాగనే యింకొకరి దగ్గరకి పోతానంటే, 'తల్లిదండ్రుల్లేరని చిన్నప్పటినుండి యిక్కడ ఉండి, యిప్పుడు రెక్కలొచ్చాయని పోతానంటావురా', అని నాన్నగారు తిడతారు. నాకు వెనక్కి నూయి, ముందుకు గోయి లాగుంది అమ్మగారు మీనుంచి" అన్నాడు తలగుడ్డ విప్పుతూ డ్రయివరు బోయ్.

"అమ్మా గిమ్మా అని పిలవొద్దని ఎన్ని సార్లు చెప్పాను. ముందువెళ్లి ఆ ధారిని పోతున్నవార్ని పిలు, కొంచెం కారు కదిపి వెడతారు" అని గద్దిస్తూ టక్ మని కారు తలుపుతీసి ప్రక్కనున్న దిండు చంకలోకి తీసికొని కార్లో కూర్చుంది లక్ష్మి. ఎదురుగా తలొంచి అయిష్టంగా వెళ్తున్న కారు కుర్రవాడ్ని చూసి మరింత చిరాకుతో రెండో ప్రక్కకు ఒత్తిగిల్తూ యిస్సుమంటూ నుదురుమీద పడిన జుత్తును చెవ్వుమీదకు లాక్కుంది. ఎదురుగా సువర్ణ రేకులతో తాపితమైన దేవాలయ గోపురము, దానిమీద నున్న గుమ్మడిపండు లాంటి కలశం లక్ష్మి కంటబడ్డాయి. ఈ సారయినా సింహాద్రి దేవుడు నా గర్భం పండిస్తాడో లేదో అని కలతచెందుతూ చెమటకు తడిచిన శరీరాన్ని తన నీలిరంగు చీర కొంగుతో తుడుచుకొంటూ గాలి కొఱకని ముందరనున్న కారు అద్దాన్ని పైకి లేవనెత్తింది లక్ష్మి. మబ్బుల్లోనుంచి బయలు వెడలుతున్న సూర్యబింబం లక్ష్మికి బారసాల నాటి స్నానం పూర్తి అయిన బాలింతరాలి ముఖంలా కనిపించింది. ఆ లేత యెండకిరణాలికి శరీరం మీద ముత్యాల్లాంటి స్వేద బిందువులు లేచాయి. వాటిని తుడుచుకుంటూ తనకున్న ఆరోగ్యం, అందం వ్యర్థం కావలసిందేనా? తన తండ్రి దగ్గరనుండి తనకు సంక్రమించనున్న హద్దులేని ఆస్తిపాస్తులకి వారసులు లేని గతి కలగవలసిందేనా? అని ఆవేదన చెంది యింత సిరిసంపద లిచ్చిన లక్ష్మీపతి

సంతానభాగ్యం మాత్రం ఎందుకు కలిగించడు! అని తన్నుతానే సముదాయించుకుంది లక్ష్మి.

2

ఆరవక్లాసు పూర్తి కాకుండానే "చదువుకొని ఉద్యోగం చేయాలా, ఊళ్లు యేలాలా" అంటూ చదువు మానిపించాడు తండ్రి కూతురు లక్ష్మిని. ఒకేఒక కూతురు కాబట్టి యితరుల యింటికి పంపించుట కిష్టపడక ఒక సామాన్య కుటుంబమునకు చెందిన వ్యక్తికిచ్చి పెండ్లిచేసి యిల్లరికం తెచ్చుకున్నాడు. ఉన్నది పెద్ద పట్టణం; పైగా కన్నవారిల్లు. అందుచే లక్ష్మికి దినాలు చాల ఉల్లాసంగా గడిచిపోతున్నాయి. కాని యీమధ్య తరచు యిరుగుపొరుగువారు, "ఎంతుంటే ఎందుకు, సంతానంలేని ఒడికి, చందమామలేని ఆకాశంకి శోభా సొంపా" అని అంటున్న మాటలు లక్ష్మికి మనస్సులో ఒక రకమయిన ఆవేదన్ని కలిగించాయి. తత్ఫలితంగా నోములూ, వ్రతాలు తీర్థయాత్రలే దైనిక కృత్యాలయాయి.

ఆదినం అందుకనే సింహాచలం ఆలయానికి స్వంతకారుమీద వచ్చింది. దైవదర్శనం, బ్రాహ్మణసేవ ముగించుకొని వచ్చేసరికి రాత్రి ఏ రెండు గంటలకో లేచాడేమో కారుబోయ్ కునుకుతున్నాడు. అది చూసి అలవాటుకి అవకాశం కలిసొచ్చింది కాబట్టి చీవాట్లు పెట్టకుండా ఉండలేక పోయింది లక్ష్మి. ఇప్పుడు పంపిన కారుబోయ్ యింకా రానందుకు మరింత మండుతూ కారులోనుంచి వెలుపలికి వచ్చి నిస్సహాయంగా సింహాచలం కొండల్లోకి చూసింది. ఇటువంటి వెధవ పరిస్థితి ప్రపంచంలో తనకొక్కరికే కాదుకదా అనుకుంది. సర్వసౌఖ్యాలకు ధనమే మూలమని తండ్రివద్ద నేర్చుకున్న మంత్రం తప్పనీ కించిత్ అనుభవం కలిగిన లక్ష్మి కండ్ల ఎదుట గత జీవితఘట్టాలు అనేకం సినిమా చిత్రముల్లా గోచరించాయి. ఇరుగు పొరుగువారు తమ పిల్లలు చేస్తున్న అల్లరులు గురించి వినిపిస్తున్నప్పుడు వెటకారంగా నవ్వేది లక్ష్మి; "పిల్లడకు నలుసుగా ఉంది బీచికి రాలేన"న్న స్నేహితురాండ్రుల సంసార తాపత్రయం చూసి వెధవ బ్రతుకు అని పెదవి విరస్తూండేది. ఎక్కడలేంది పాలడబ్బాలకే చాలకపోతూ యుంటే పట్టుచీరె లెలా వస్తాయని తన ఆడబొట్టంటున్నప్పుడు 'కర్మ' అని వేదాంతం చెప్పేది. అవన్నీ యిప్పుడు తనకే చెందుతున్నట్లు నిరూపించాయి లక్ష్మికి. ఆ ధ్యానంలో మునిగి పరధ్యానంగా యుంది లక్ష్మి. అప్పుడు కారు త్రోయడానికి తీసికొని వచ్చిన గొల్లవాడి రెండు మేకపిల్లలూ కుప్పిగంతులతో వచ్చి లక్ష్మి చీరకొంగులో తల దూర్చాయి. త్రుళ్లిపడి లక్ష్మి చూసింది. రెండు 'మే' అంటూ మమకారంగా అరచాయి. ఇంతలో కారుబోయ్ గొల్లవాడు వచ్చారు. లక్ష్మి రెండు మేకపిల్లలని చిరాగ్గా చేత్తో తొలగించి ధనీమని కారు తలుపుతీసి స్టీరింగుమీద చేతులువేసి కారులో కూర్చుంది. ఆ దృశ్యం చూసి వెర్రిగొల్ల, "మీ అమ్మగార్కి మా పిల్లల మీద మాచెడ్డ మక్కువు లాగుందే" అని వెటకారంగా అన్నాడు. "ఊరుకోరా

బాబు ఆవిడగార్ని అమ్మగారని పిలిస్తే మహాగొప్ప కోపం, పిల్లలంటేమరీ చిరాకు'' అని నెమ్మదిగా గొల్లకి సమాధానం యిస్తూ కారుని తోయసాగాడు. గొల్ల కారు కెదురుగా వచ్చి గెంతులేస్తున్న తన మేకపిల్లల్ని ప్రక్కకుత్రోలి లక్ష్మి వైపు బేలగా చూస్తూ కారు వెనక్కి వెళ్లాడు. గొల్లచేయి పడ్డంతోడనే కారు కదిలింది; డ్రయివరు బోయ్ కారులో కూర్చుని, "అమ్మగారూ..." అని ఏదో చెప్పబోతూ పొరపాటయినట్టు నాలిక కరుచుకున్నాడు. లక్ష్మి వెంటనే వెనక్కి చూసి, "ఏంరా అబ్బాయి" అని అనుకోకుండానే అన్నది. ఆ మాటలు విన్న కుర్రవాడు తన చెవ్వుల్ని తానే నమ్మలేక పోయాడు. అలాగన్న లక్ష్మి తన హృదయాన్ని తానే నమ్మలేక పోతుంది. కాని కారు మాత్రం యీ యిరువురి సందేహాలకు ఆగక యింటికి చేరుకుంది.

—(o)—

# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

(గతసంచిక తరువాయి)

కృష్ణకుమార్ మాదిగవాడా అని మనసులోనే అనుకొని, "మీపేరు బాగానే వుంది. అయినా యీ కాలం వాళ్లందరూ మంచిపేర్లే పెట్టుకుంటున్నారు" అనేసి ఆలోచిస్తూ "ఇవి దేశానికి ఉన్నతమైన లక్షణాలు" అంది నవ్వుతూ.

కుమార్ కూడ నవ్వి, 'అవును' అన్నాడు.

"అయితే నువ్వు ఇంగ్లీషులో యెందుకు మాట్లాడేవు?"

"కోప్పడకండి మిసెస్"

"నేనేమీ మిసెస్‌ను కాదు – ఇంకా పెళ్లి కాలేదు".

"క్షమించండి... అయినా క్రొత్తవాళ్లు అన్నంత మాత్రంలో కొంప మునిగిపోయేదేమీ లేదు కదండీ"

పోనీలే అన్న నిర్లక్ష్య భావంతో కమల యింటి కెదురుగా వున్న టెన్నిస్ కోర్టువైపు నడిచింది. వెన కాలే కుమార్ కూడ వెళ్లాడు.

"నువ్వు ఇంగ్లీషు బాగా మాట్లాడుతున్నావు. ఇంగ్లీషువాళ్ల దగ్గర పనిచేశావా?" ఆ ప్రశ్న అత డికి అపహాస్యంగా తోచింది. చికాకు వేసింది. అయినా నెమ్మదిగానే సమాధానం చెప్పాడు. "లేదండి - చదువుకున్నాను".

కమల ఆశ్చర్యంతో క్రీగంటి చూపులు చూస్తూ, వ్రేలు పైకి చూపిస్తూ "ఇది యేమిటి?" అంది. పని కోసం వస్తే యీ పరీక్షలన్నీ యేమిటని విసుగొచ్చిం దతనికి. ఏమిటిది_చంటిపిల్లవాణ్ణి అడిగినట్లు అడుగు తోంది? తాను మాదిగవాడే అనుకో – అయినా మాత్రం యీ ప్రశ్నలన్నీ అనావశ్యకం. పదవు ల్లోను, మంచి మర్యాదల్లోను అందరూ సమానమే. వాటికి పెద్ద చిన్న యేమిటి? ఏమిటీ పిచ్చిపిచ్చి ప్రశ్నలు? తన బాధనంతా మనసులోనే అణచు కొని, "మేఘాలు" అన్నాడు.

"అయితే వాటిని గురించి యింగ్లీషులో ఐదు నిముషాలు మాట్లాడు."

కుమార్‌బాబు విసుగ్గా ఆమెవైపు చూస్తూ "ఏమిటి యిదంతా? ప్రత్తిగింజలు తీసినట్లుగా ఏమిటిది?" అన్నాడు ఇంగ్లీషులో.

"అవునవును..."

"ప్రత్తిని ఒడికినా ఫలితం దక్కుతుంది."

"అటువంటిదేమీ లేదు..."

"అంటే అంతకన్న యెక్కువ పరిశ్రమ వుంటుం దన్న మాట".

"నువ్వు నా దగ్గరగా వుంటే..."

"అంటే..."

"నువ్వెంత ఆశిస్తావో నాకు తెల్వియదు. కాని... రెండు వందల రూపాయలు... మీకు ఇంగ్లీషు సాహి త్యం బాగా తెలిసివుంటే నాకు చెప్పండి..."

"అది సరే. ఇందాక మీరడిగిన దానికి నా స్వంత అభిప్రాయం చెప్పమంటారా? లేక ఇంగ్లీషు కవులు వ్రాసినది చెప్పమన్నారా? అయినా యీ మేఘాలను గురించిన వైజ్ఞానిక వ్యాఖ్యానం మీకు వినాలని లేదు కదూ!"

ఆమె మాటలు తప్పించి, "మీరె తవరకు చదువు కున్నారూ?" అంది.

"డి.లిట్. (లండన్) – ఇంగ్లీషు సాహిత్యంలో"

కమల సిగ్గుపడి "యెంత నాటకమాడారండి" అంది నమ్రతగా.

"నాటకం కాదు. ఇది భారతదేశ స్వరూపం" అన్నాడు చిరునవ్వుతో. ఆమె మాట్లాడక ఆలోచ నలో వున్నట్లు అట్లాగే నిలబడిపోయి హృదయం లోనే అతనికి జోహారు అర్పించి, తల వంచుకొని అంది – "నేను బి.ఏ. ఫైనలు చదువుతున్నాను. మా నాన్నగారితో చెప్తాను – నెలకు రెండువందలు. ఉదయము రెండు గంటలు ఇంగ్లీషు చెప్పాలి..." అంటూ యింటివైపు నడుస్తూ "మీరు కేవలం హిందువులై వుండాలి..." అని అతడి ముఖంలోకి చూచింది. అవునన్నట్లు తలూపాడు.

"అంటే..."

ఆమె అడగబోయేదేమిటో గ్రహించి, "కన్యాకుబ్జ బ్రాహ్మణులం" అన్నాడు.

కుమార్‌ను తనకూడ యింట్లోకి తీసుకువెళ్లి హాలులో కుర్చీలో కూర్చోబెట్టి తండ్రి గదిలోకి వెళ్లింది. కుమార్ చుట్టూవున్న ఫోటోలను చూస్తూ ఆలోచిస్తూ కూర్చున్నాడు. మరుక్షణంలోనే కమల తండ్రితోకూడ ప్రపంచరీతుల్ని గురించి చర్చిస్తూ హాల్లోకి వచ్చింది. "ఈయనే నాన్నా. కన్యాకుబ్జ బ్రాహ్మణులు. లండన్ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు సాహిత్యంలో డి.లిట్. ప్యాసయ్యారు. ఏ ఉద్యోగము దొరక్క యీ వృత్తి చేబట్టారు" అంది కుమార్‌ను చూపిస్తూ.

కుమార్ కూడ తాను చేసేపని యిదేనన్నట్లు బ్రష్షు తీసి చూపిస్తూ, "మీ అమ్మాయి ఇంగ్లీషు చదువుకుంటానంది. ప్రతి ఉదయం రెండు గంటలు చెప్పాలట – రెండు వందలు యిస్తుందిట –" అన్నాడు బెంగాలీలో.

కమల తండ్రి దినేష్‌బాబు గొప్ప వకీలు. నెలకు వచ్చే ఆదాయం ఎంతో లెఖ్ఖలేదు. బ్రహ్మసమాజ మతస్థుడు. ఆయనకు ఐశ్వర్యమంతా ఒకత్తు – కూతురు ఒకెత్తు. అందువల్ల యీ విషయమై అతడేమీ అనుకోలేదు. కుర్రాడు అందమైనవాడు. చదువుకున్నాడు. బ్రాహ్మణుడు. కమల యీతణ్ణి ప్రేమిస్తోంది కాబోలనుకున్నాడు. అందువల్ల తానెందుకు అడ్డురావాలి? అతణ్ణి యీపాటికే సమాజంలోనుండి వెలివేసి వుండవచ్చు. అందువల్ల అతనిని బ్రహ్మసమాజంలోకి తీసుకోవచ్చు. అతడొక ఆదర్శ వ్యక్తిగా వుంటాడనుకొని కుమార్తె కోరికను అంగీకరించి, కుమార్‌ను మరునాటి ఉదయంనుండి రమ్మనమని చెప్పాడు.

## 19

బ్రాహ్మణుల భోజనాలైన మరునాడు నిరుపమ నీలిని వెంటబెట్టుకుని తిరిగి లక్నో వచ్చేసింది. సమాజంలో కులము, మతము, సంస్కృతి పేర జరిగే యీ అనాచారాలన్నీ ఆమె మనస్సును వేధిస్తున్నాయి. ఒకొక్క వ్యక్తితో స్నేహం చెయ్యాలంటే ఒకొక్కప్పుడు సమాజపు ఆవశ్యకత యెంతైనా వుంటుంది. అయితే, ప్రశాంతతలేని సమాజాన్ని వదలివెయ్యడమే మంచిది... వివాహమనేది జీవితానికి రసమయమైనది. ఏ విధమైన అనుకూలత లేకపోయినా అన్నీ అభాసాలౌతాయి. నీతినియమాలులేని యీ సమాజపు ధోరణిని అంగీకరించి అనుసరిస్తే ఆత్మహత్య చేసుకున్నట్లే.

నిరుపమ గదిలో కూర్చుని వుంది. గ్రామంలో జరిగినవన్నీ కళ్లముందు చిత్రించుకుని నవ్వుకుంటోంది. అనేక రహస్యాలతో నిండివున్న ఆమె హృదయం ఒకసారి వికసించింది. తనకు తన హృదయంలోనే సానుభూతి దొరికింది. కిటికీ తలుపులు తీసేవున్నాయి. వర్షపుగాలి వీస్తోంది. తాను మొదటిసారిగా యెక్కడైతే కుమార్‌ను చూచిందో ఆ వైపే కిటికీలోంచి చూస్తూ కూర్చుంది. ఒక్క వేడినిట్టూర్పు వీచే గాలిలో కలిసిపోయింది. ఆమె ఆలోచనలు చిలువలు పలువలై ఆకుల్లోవున్న మొగ్గల్లా వున్నాయి. ఇంతలో గదిలోని ప్రశాంతతను చీలుస్తూ దాసీది వచ్చింది. నీలిని పిల్చుకు రమ్మనమని, తాను లేచి నిలువుటద్దం ముందు నిలబడి జుత్తు సవరించుకుంటోంది.

"అక్కయ్యా, పిలిచావా?" అంటూ నీలి వచ్చింది.

"పద. కాస్సేపు అలా తిరిగివద్దాం" అంటూ చెప్పులు తొడుక్కుని, నీలి చేయి పట్టుకుని వీధిలోకి వచ్చిన తర్వాత "నీలీ, కుమార్‌బాబు యిల్లు యెక్కడో తెల్సునా?" అంది.

'ఓ' అంది నీలి నవ్వుతూ ఓరచూపుతో అక్కను చూస్తూ.

అంతకు అరగంట ముందే నీలి వెళ్లి కుమార్‌బాబు యిల్లు చూచి వచ్చింది. "కేవలం యిల్లు మాత్రం చూచాను" అంది.

నిరు సంతోషంతో నీలి చేయి పట్టుకుని నడవడం ప్రారంభించింది. ఇంత హడావిడిగా యెందుకు బయల్దేరిందా అని ఆలోచిస్తోంది నీలి. కొంతదూరం వచ్చాక నీలి ఆగి, "యిదే కుమార్‌బాబు యిల్లు" అంది. "నడు, వెడదాం" అని గుమ్మందాకా వెళ్లాక, 'పిలు' అంది నిరు. నీలి తలుపు తట్టింది. రామచంద్ర వచ్చి తలుపు తీశాడు. నిరుపమను చూచి సంతోషంతో నవ్వుతూ లోపలికి రమ్మనమని చెప్పి లోపలవున్న తల్లిదగ్గరకు పరుగెత్తాడు. నిరుపమ సిగ్గుతో కొత్త పెళ్లికూతురులాగ లోపల అడుగుపెట్టుతుంటే సావిత్రిదేవి లోపలినుండి హాలు

లోకి వచ్చి "రా అమ్మా" అంది బెంగాలీలో. నీలి మాత్రం లోపలవున్న రామచంద్ర దగ్గరకు వెళ్లి, ఏదో తనే అన్నీ తెల్సున్నదీ, నవనాగరికురాలు అయినట్లు "మా లక్నో యెల్లావుంది ?" అంది. రామచంద్ర మాత్రం తక్కువవాడా, "కలకత్తా వెంట దిబ్బలాగ వుంది" అన్నాడు.

నిరుపమకు యిల్లంతా చూపెట్టింది సావిత్రీదేవి. యిల్లు చాల బాగుంది. మేడమీద రెండవ అంతస్థులో యిల్లు. సామాను పైకి కన్పించకుండా అలమార్లలో పెట్టేశారు. వెనక గదిలో ఒక ప్రక్కగా మంచం వుంది. ఒకప్రక్క కుమార్ విదేశాలనుండి తెచ్చిన వస్తువులు టేబులుమీద పెట్టారు. ఆ అలంకరణ అంతా చూచి, "యిదంతా మీరే సర్దారా ?" అంది నిరు స్వచ్ఛమైన హిందీలో.

"ఇదంతా నేను వచ్చేసరికే కుమార్ సర్ది వుంచాడు. కేవలం యింటిసామాను మాత్రం నేను తీసుకువచ్చాను" అంటూ సావిత్రీదేవి నిరుపమ చెయ్యి పట్టుకుని మంచంమీద కూర్చోబెట్టి, "ఇది కుమార్ మంచం" అని పరీక్షగా ఆమె ముఖంలోకి చూచింది యేదైనా మార్పు కన్పిస్తుందేమోనని. నిరు సిగ్గుపడి చాల సుకుమారంగా అంది – "గ్రామంలో వున్నప్పుడు చాల కష్టపడుతూ పనిచేసేవారు మీరు, ఇక్కడ కొద్దిగా బాగానే వుందనుకుంటాను" అంటూ తలవంచి సిగ్గుతో, "కుమార్ బాబుకు పెళ్లి చెయ్యరేం ?" అంది.

వాళ్ల సమాజంలో పిల్ల దొరకడం కష్టమనే భావాన్ని తనలోనే దాచుకొని, "కుమార్ తన యిష్టాయిష్టాల మీదనే నడుస్తున్నాడు. అసలు వాడు విదేశాలకు వెళ్లడం తండ్రికి యిష్టంలేదు, కాని నా బలవంతం మీదనే పంపించారు. ఉన్నది కాస్తా వాడి చదువుకే అయిపోయింది. వాడు తిరిగి వచ్చేసరికల్లా పరిస్థితులెలా వున్నాయో నీకు తెల్సు. అందువల్ల ప్రస్తుత పరిస్థితుల్లో వాడి యిష్ట ప్రకారమే నడుచుకోవాలి" అంది సావిత్రీదేవి.

"కాని ప్రపంచంలో యితరుల అభిప్రాయాలను కూడ మన్నించాలి గదా !" అని "ఒకవేళ యెవరైనా..." అంటూ ఒక్కక్షణం ఆగిపోయి "అతడు స్వతంత్రుడై పాడైపోడూ ?" అంది క్రీగంటితో సావిత్రీదేవిని చూస్తూ.

"నువ్వు చెప్పింది నిజమే. ప్రపంచంలో యెదుటి వారి అభిప్రాయాలను కూడ మన్నించాలి. ఒకడు ఎవరినైనా ప్రేమిస్తే వాళ్ల యిష్టం వచ్చినట్లే నడుచుకోవాలి."

"ఆయనైతే విదేశాలకు వెళ్లివచ్చారు. అక్కడ యెవ్వరైనా ఆయన మనసులో వుండి వుండవచ్చు. అటువంటివాళ్ల నెవరినైనా ఒకవేళ పెళ్లి చేసుకుంటే మీకు కష్టం కదూ ?" అనేసి పెద్దపెద్ద కళ్లతో సావిత్రిదేవిని చూచి నవ్వింది.

"కష్టమెందుకమ్మా ! పిల్లల దృష్టి యెటు వుంటుందో అటే తల్లిప్రేమ కూడా ప్రవహిస్తుంది. పిల్లలు సుఖంగా వుండడమే కావలసింది" అని లోపలికి వెళ్లి, బజారుకు వెళ్లి స్వీట్సు తీసుకు రమ్మనమని రామచంద్రను పంపి తిరిగివచ్చి నిరుపమ కెదురుగా కుర్చీలో కూర్చుంది.

"నేను రామాపురం జమీందారిణినే, అయినా మా వైపునుండే మీకెన్నో బాధలు కలిగాయి. ఎన్నో కష్టాలు పెట్టివుంటారు. మొన్నటివరకు ఈ విషయాలేమీ నాకు తెలియవు. అందువల్ల మీ క్షమాపణ కోరడానికే యీనాడు వచ్చాను. ఆ నాడు మీరు నన్ను పిలిచారు. కాని నేను రాలేకపోయాను. వెళ్లకపోతే వ్యవహారానికి విరుద్ధంగా వుంటుందని, మర్యాద కాదని మా అన్నయ్యకూడ చెప్పాడు" అంది నిరు తల వంచుకుని.

ఇంతలో మాలిక్వాతల్లి తమలపాకుల పళ్లెం తీసుకువచ్చి నిరుపమ ముందర పెట్టింది. నిరు అందులోంచి ఏలక్కాయ తీసుకుని ఆమెను చూచి తల వంచి ఆలోచించడం మొదలుపెట్టింది. "క్షమాపణ యెందుకమ్మా ?" అంటూ సావిత్రీదేవి మాలిక్వా మరణాన్ని, తన కష్టాలను జ్ఞప్తికి తెచ్చుకుని గంభీరంగా అంది – "నీ పాలం నువ్వు తీసుకున్నావు. తలిదండ్రులు ముసలివాళ్లైనా కొడుకులు ఆస్తికోసం పేచీలు పెట్టి లాక్కుంటూ వుంటారు. అటువంటప్పుడు మీ ఆస్తిమీద మీ అధికారాన్ని నిలుపుకోవడంలో తప్పేమిటి ?"

కొద్దిక్షణాలు గదిలో అతిప్రశాంతంగా వుంది. మాలిక్వాతల్లి కళ్లంట తడిబెట్టి బైటికి వెళ్లిపోయింది.

"నువ్వు పరాయి యింటి ఆడపిల్లవైనా నిన్ను చూస్తుంటే నాకేవిధమైన దిగులులేదు. నువ్వు రామచంద్రపై చూపిన ఆ ప్రేమానురాగాల్నే నేనూ అనుభవిస్తున్నాను. మాలో ఆశేక లోటుపాట్లుండ

వచ్చు. అన్నీ నీకు తెలిసే వుండవచ్చు కూడ... ఇదేమీ నిన్ను పొగడ్డంకోసం కాదు... నీ ఆదరాభిమానాన్నే కోరుతున్నాను. అయినా కుమార్ బాబు విషయంలో నేనేమీ అడ్డంరాను. ఏది ఎల్లా జరిగినా రామచంద్ర చదువు విషయంలో మాత్రం నేననుకున్నది కాలేదు. నువ్వు యిస్తానన్నది తీసుకుందుకు నాకే అభ్యంతరం లేదు. కాని వాడి చదువు బాధ్యత అంతా తానే వహిస్తానని కుమార్ చెప్పాడు... అందరిలోను నీకు పలుకుబడి వుంది. అందరూ నీమాట వింటారు. అందరియెడ ఒకే సానుభూతితో వుంటావు. గ్రామంలో వున్న వాళ్లందరూ నీవాళ్లే. అందర్నీ ఒక్కలాగే చూడాలి. న్యాయం మీ చేతుల్లో వుంది. మాకు న్యాయం జరగాలంటే మీ వల్లనే జరగాలి..."

సావిత్రీదేవి మాటల ఆంతర్యాన్ని గ్రహించి నిరుపమ సిగ్గుపడి నమ్రతతో అంది_ "మాలిక్యా తల్లికి మూడెకరాల పొలం యిచ్చాను. ఆవిడ బ్రతికి వున్నంతకాలం అనుభవిస్తుంది. ఈ విషయం మొదటనే మీకు చెప్పదామనుకున్నాను. కాని _ మీరు మొదటనే దెబ్బకొట్టి నన్ను నిరాశ చేశారు..."

ఆ మాటకు సావిత్రిదేవి నొచ్చుకుని, "దెబ్బకొట్టడం కాదమ్మా. నిన్ను బాధ పెట్టాలని, అవమాన పరచాలని కాదు, అసలు మాట చెప్పాను... బాధపడడానికి యేమాత్రం ఆస్కారంలేదు. రామచంద్రమీద నీకెంత అధికారం వుందో - కుమార్ మీదకూడ అంతేవుంది. నువ్వేదైతే యివ్వదల్చుకున్నావో అది రామచంద్ర కియ్యి... తప్పకుండా తీసుకుంటాను..."

"పొలము, తోట రామచంద్రునిపేర యెప్పుడో వ్రాయడమైంది... కాన్పూరులో మీకు రెండిళ్లు వుండాలి కదూ..."

"కుమార్ చదువుకోసం వాటిని తనఖా పెట్టవలసి వచ్చింది..."

"ఆ తనఖాదారుడికి ఆ డబ్బు పూర్తిగా యిచ్చేసి ఆ యిళ్లు రెండూ కూడ రామచంద్ర పేర వ్రాయిస్తున్నాను."

సావిత్రీదేవి ముఖంలో విస్మయమనేది యెక్కడా కన్పించలేదు. లోపలవున్న మాలిక్యాతల్లి యెందుకో గదిలోకి రాగానే, "ఈవిణ్ణి గుర్తుపట్టేవా ... మన జమీందారిణి" అంది సావిత్రిదేవి. మాలిక్యాతల్లి తెల్సినట్లుగా తలూపింది నవ్వుతూ. "నీకు మూడెకరాలు పొలం యిచ్చింది" అంది మళ్లీ సావిత్రిదేవి.

ఇంతలో బైటికి వెళ్లిన రామచంద్ర తిరిగి వచ్చాడు

## 20

కమల లోపల బట్టలు మార్చుకుంటోంది. కుమార్ బైట హాలులో కూర్చుని ఆమె రాకకై నిరీక్షిస్తున్నాడు. ఆమె దృష్టిలో రోజురోజుకీ వారి సంబంధ బాంధవ్యాల బంధనం గట్టిపడుతోంది. అతణ్ణి తన హృదయంలో యిముడ్చుకుంటోంది. ఆనాడు ఆమె పిలిచింది. అతడు వెళ్లాడు. అంతే, ఈ పరిస్థితుల్లో యెవరేం చేసినా అతడు లక్ష్యపెట్టడు. స్వతహా స్వతంత్రప్రియుడు. కమల బాగా సింగారించుకుని వచ్చి, వీధి గుమ్మంలో నిలబడి, "వాతావరణం యెంత బాగుందో!" అంది. కుమార్ కూడా పైకి క్రిందుకు చూచి, "ఆకసము, భూమికూడ కడుపు నిండి వున్నాయి. అందుకనే నవ్వుతున్నాయి" అన్నాడు. కమల నవ్వి, నడుస్తూ అంది_ "మీరు కవిత్వం వ్రాస్తే చాల బాగుంటుంది. మీకు యెవరి కవిత్వమంటే యిష్టం? షెల్లీదనా?..."

"ఒకటేమిటి? చాల వున్నాయి. షా కవిత యెంత చమత్కారంగా వుంటుందో తెలుసా?... మా బెంగాలీవాళ్లలో కూడ గొప్పగొప్ప కవులున్నారు. రవిబాబు కవిత్వం చాల బాగుంటుంది."

"అయితే మీకు బెంగాలీ సాహిత్యం కూడ తెలుసా?" అంది ఆశ్చర్యంగా.

"అవును నేను అక్కడే యింతవాణ్ణి అయ్యాను. అక్కడే డిగ్రీ తీసుకున్నాను. మొదటనుండీ అక్కడే వుండటంవల్ల బెంగాలీ చదవవలసి వచ్చింది. బెంగాలీ సాహిత్యంకూడా బాగా చదివాను."

(సశేషము)

# "తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి"

శ్రీమతి కొండా శ్యామలాదేవి



కర్మబంధాల ఖండించు కర్మయోగ
మర్మమెఱిగి, దుర్మమకార మమతవీడి,
కర్మములజేసి, నిజకుల ధర్మనిరతి,
దెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

వేదకర్మలు భోగాల విధము జూపు,
వేదకర్మంబు కంటె వేఱేది లేద
టంచు, భోగపరాయణాత్మకుల కెపుడు
జన్మకర్మ బంధంబులు సడలబోవు,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

కర్మములకె యధికారి కాగలవు నీవు,
కర్మఫలముల కధికారి గావు సుమ్మి,
కర్మముల వీడబోక, అద్దాన, కర్మ
ఫలములకు లోనుగానట్టి పరమపథము
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

కర్మఫలమున కాంక్షను గలుగనీక,
దుర్మమత వీడి, సత్కర్మ మర్మమెఱిగి,
కర్మములజేసి, మోక్షంబు గాంచువిధము,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

కర్మముల జేయకున్న నైష్కర్మ్యసిద్ధి
రాదు, కర్మాలు విడుచు మాత్రాన ముక్తి
లేదు, గావున కర్మంబు లీవు జేయ
గావలెను సుమ్మి తత్ఫలకాంక్ష వీడి,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

కర్మముల జేయకుండొక్క క్షణముగూడ
గడువ నేరదీజగమున, కాయయాత్ర
సలుపుటకుగూడ కర్మముల్ సలుపవలయు,
గాదెకో, ప్రకృతి గుణముల కతననరుడు
కర్మలను సేయతప్ప దకర్మ కంటె
కర్మమేల్గాన, నియమిత కర్మజేయ
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

కర్మకోసమే జేయుము కర్మ నీవు
కర్మ ఫల సంభూత సంకలన వీడి,
కర్మయజ్ఞంబు కోసమే గానియెడల,
అది ప్రబల బంధహేతువే యగునటంచు
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

అజ్ఞుడెట్లు ఫలాస కర్మలను జేయు
నట్లు విజ్ఞుండు సక్తత నాచరింప
గావలయు కర్మ, లోకసంగ్రహము కొఱకు,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

కరము కర్మేంద్రియములచే గట్టువడుచు,
విషయభోగాల గొనుచు, నిర్విషయుభంగి,
కపటనాటక మాడెడి కల్మషుండు,
పాపముల బొందు, నిర్మమకారవృత్తి
ఇంద్రియంబులలోగాని, యెవడు కర్మ
యోగమును జేయునో; వాడే
యుత్తముండు,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

లౌకికాదులబడు భోగలాలసుండు,
అద్వితీయమా పరమార్థ మఱయలేడు,
ఇది యతని కెపుడు రాత్రి, ఐహికములెల్ల
పరమయోగికి రాత్రి, ఈ ఫణితి నీవు
తెలిసికొనుమో, సహోదరి తెలివిగలిగి॥

బుద్ధి ఆత్మయందును పరిపూర్ణయుక్తి
లగ్నమగుచు, సంకల్ప వికల్పరహిత
మగునో, అదియె సమాధి, అద్దానిగూడ,
ఆత్మ పరమాత్మ సమత వ్యవస్థయంద్రు,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

తన్ను దానెఱుంగుచు, దవలోన తనను
గనుచు, కోరికలన్ అణచుకొనుచు,

సుఖము

గోరకయు, దుఃఖమునకును గుందకయును,
విజ్ఞుఁడగు నతఁడే స్థితప్రజ్ఞుఁడనఁగ
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

ఇంద్రియంబులు నిగ్రహించు నెంతవారి
నైన, పరమాత్మ తత్పరులైనవారి
కది వశంబగు, నవ్వాని నదుపుబెట్టు
విజ్ఞుఁడగు నతఁడే స్థితప్రజ్ఞుఁడనఁగ
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

విషయముల చింతనమునను విషయవాంఛ
బుట్టు, నద్దాన కోరికల్ బుట్టుచుండు,
కోరికలుబుట్ట క్రోధంబుగూడ బుట్టు,
క్రోధమున మోహగుణములు కొనలు జూపు,
దాన చిత్తవిభ్రమణంబు దగులుచుండు,
చిత్తవిభ్రమణంబున చెడును బుద్ధి,
బుద్ధి చెడునంత సర్వంబు పూర్తిగ చెడు,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

తన్నుఁగప్పిన మోహంపు తమసువీడి,
నిశ్చలజ్యోతియై మది నెగడునపుడు,
విన్నవిషయంబు, వినదగు విషయమెల్ల
ఫలవిహీనంబుగంచుదోచు, నిభ్భంగినెపుడు
కలతనొందక బుద్ధినిశ్చలతగనొనా
అప్పుడే జీవి జ్ఞానంబు నందగలడు,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

---

# ఆంధ్ర భాష

శ్రీమతులు చదలవాడ సోదరీ కవయిత్రులు

---

సంస్కృత ప్రత్యయముల సంసర్గ మంది
ఆంధ్ర భాషామతల్లి అత్యధిక వృద్ధిఁ
బడయుచున్నది; దానిని వ్యాకరణము
ఎంతవఱకు శాసించునో! ఎవ్వఁడెఱుఁగు!

తల్లి - బిడ్డలవలె సంస్కృతమ్ము తెనుఁగు
కలసి మెలసి వర్తించుట తెలిసికొనక
భేద మొనరించు యత్నము విఫల మగును
లోకమునకు బద్ధుండు వైయాకరణుఁడు

అన్య భాషా స్రవంతు లాంధ్రాబ్ధియందు
సంగ్న మగుచుండు; అదియ సమంజసమ్ము
తెలిసి యిది కృష్ణదేవరాయలు వచించె.—
దేశ భాషలలోపలఁ దెలుఁగు లెస్స



# మతకర్తలు: తద్భక్తిభేదములు

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

—o—

(గత సంచిక తరువాయి)

శ్రీ వల్లభాచార్యుఁడు, క్రీ॥శ॥1535 సం॥ వైశాఖ బహుళ ఏకాదశి, మధ్యప్రదేశమందలి (రాయిపూరు) చంపకారణ్యమున జన్మించెను. అతని తండ్రి లక్ష్మణ భట్టారకుఁడు, తల్లి ఇలామ్మ. అతఁడు ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబమునఁ బుట్టెను. అతని పూర్వికులు దక్షిణావర్తమందలి కంకిపాడ అను ప్రదేశమున ఆదిలో వసించుచుండిరి. ఇతఁడు భారద్వాజ గోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు. ఈ గోత్రము భారద్వాజ, ఆయాస్య, ఆంగీరస త్రియార్షేయము. లక్ష్మణభట్టునకు ముందేడుతరములవారా కుటుంబమున సోమయజ్ఞమును యజించినవారు. నూఱు సోమయాగములు చేసినవాఁడు భగవదాదేశమున వచ్చినవాఁడో,- కాదేని భగవత్సామీప్యమందిన మహాత్ముఁడో యయియుండవలెనని ఆర్యుల సిద్ధాంతము. ఏతదనుసారము తన్మఖశతము లక్ష్మణభట్టు కాలమునకుఁ బూర్తి యగుటచే పరమేశ్వరుఁడే వల్లభాచార్యుఁడని జనులు విశ్వసించిరి. కొందఱతని అగ్నిహోత్రుని యవతారమని భావించిరి. తమవంశము వారు పారంపర్యముగ అధ్వరశతము నిర్విఘ్నముగఁ గొనసాగించినందులకు జ్ఞాపకార్థముగ లక్షబ్రాహ్మణ సమారాధనమును వారణాసిలో నొనర్చు సంకల్పమూని స్వస్థలమునుండి బయలువెడలెను. అట్టియెడ, జంపకారణ్యము చేరునప్పటి కతనికి వల్లభుఁడుదయించెను. లక్ష్మణభట్టారకున కితఁడు ద్వితీయతనయుఁడు.

వల్లభుఁడు ఉపనీతుఁడు కాగానే కాశిలోని మాధవేంద్రపురి- అను గురు నాశ్రయించి, తన పదునొకండవ యేట వేదవేదాంగములఁ బ్రావీణ్యము సంపాదించెను. పిదప కాశీ విడిచి బృందావనమునకు వెడలెను. అనంతర మాతఁడార్యావర్తమందలి పుణ్యక్షేత్ర యాత్రాదీక్ష వహించెను. దక్షిణాపథమున కరుదెంచి హంపీవిజయనగర మేలుచుండిన శ్రీకృష్ణదేవరాయల యాస్థాన విద్వాంసులను మతచర్చలలో ఓడించెను. ఆ మహారాజాస్థానముననే అతనికి వైష్ణవాచార్య బిరుదము లభించెను. ప్రతిభావతని విజ్ఞాన సంపద కంతయు సంతసించి, స్వర్ణసింహాసనమునం దాసీనుం జేసి, తక్కిన పండితులు గూడ దనకు సహకరింప శాస్త్రోక్తప్రకార మాతని బూజించెను. అప్పుడు రాయలాతనికి కాంచనసమూహము బహూకరించెను. అందాచార్యుఁడు గొంతభాగముమాత్రము స్వీకరించి తక్కిన దంతయు అక్కడి పండితులకును బ్రాహ్మణులకును బంచిపెట్టెను. దీనింబట్టి వల్లభాచార్యుఁడు ధనాకర్షణకు దూరస్థుఁడగు నెంతటి మహాయోగియో గ్రహింపనగును. శ్రీకృష్ణదేవరాయలు విజయనగరమును క్రీ॥ శ॥ 1501 నుండి 1530 వఱకుఁ బరిపాలించిన గొప్ప చక్రవర్తి. ఆచార్యుఁడన్ననో,. పదునాఱవ శతాబ్ద ప్రారంభమున నుండినవాఁడు.

విజయనగరమునుండి వల్లభుఁడు ఉజ్జయినికి వెడలి అట నతఁడు శిప్రానదీ తీరమున ఒకరావిచెట్టుక్రింద వసించుచుండెను. అది ఆచార్యుని ముఖ్యపీఠముగఁ బరిగణింపఁబడినందున దాని నిప్పుడును శిథిలము గాకుండఁ గాపాడుచున్నారు. మధురలోని ముఖ్య ఘట్టమునను, చునారులోను, మఱి కొన్ని పవిత్రస్థలములందును, అట్టిపీఠములు ఆచార్యుని పేరిటనే అతని శిష్యులు వ్యవహరించుచు, అతిజాగ్రత్తగఁ గాపాడుచున్నారు. బృందావనము, గోవర్ధనము, మొదలగు స్థలములలో ఆచార్యుఁడు దేవదేవుఁడగు శ్రీకృష్ణునకుఁ దన హృదయప్రీత్యభిమానపూర్వక పూజనములు త్రికరణశుద్ధిమై గావించెను. ఆభగవంతుఁ డెన్నియో పర్యాయములు ఆచార్యునకుఁ బ్రత్యక్షమై ఆనంద పారవశ్యమున ఒడలు మఱచునట్లు పలికెను. ఆచార్యుఁడు రాత్రిందివములు భగవదర్చన మొనర్చుట యుక్తమని ఒకదినమును ఎనిమిదియామములుగ విభజించెను. తన్మూలమున భగవద్భక్తియోగాభ్యాసమని అతని యుద్దేశము. కాని, భగవదాజ్ఞను అనుసరించి, అతనిగురించి బోధించుటయుఁ బ్రకటించుటయు, ఏతత్సందర్భమున- ఆసర్వోన్నతుని మనసార పితరుని వలె భావించుటయు- మాత్రమే యగును. ఆచార్యుని జీవితమంతయు అనేక విచిత్ర సంఘటన, [illegible]

మయినది. కాని, ఆచార్యునివంటి భక్తియోగనిష్ఠ
గలవాడు నిర్మల స్వభావము, భక్తియోగదీక్షలకిచ్చు
ప్రాధాన్యము నట్టియద్భుతకృత్యములకు ఈయఁ
జాలఁడు. కావున అట్టివిషయములనెల్ల ఏకరువుబెట్టక
అతని సామాన్య జీవితాంశములనుమాత్రమే సంగ్రహ
ముగఁ దెలుపుటచే అతనిచరిత్రము కడుంగడు స్వల్ప
మైన దనవచ్చును.

ఒకానొకప్పు డతనిచెంత నొక భక్తుఁడుండెను.
అతఁడనుదినము ఒకసాలగ్రామశిలకును, భగవద్విగ్రహ
మునకును షోడశోపచారపూజ లొనర్చువాఁడు.
కాని అతఁడా రెంటిలోను సాలగ్రామశిలకే ప్రాముఖ్య
మిచ్చుచు, భగవద్విగ్రహమును దేవుని ప్రతికృతి యని
దానికిఁ దరువాతిస్థాన మేర్పఱచువాఁడు. అప్పు డా
చార్యుఁ డోయీ ఇవి రెండును భగవచ్చిహ్నములే
యగుట వీతన్మధ్యమున విభేదము చూపుట భక్తులకుఁ
దగదు అని బోధించెను. ఆచార్యుని హితోపదేశము
ఆభక్తునిఁ జక్కదిద్దుటకు మాఱు, అతని విగ్రహగత
వ్యతిరేకమనోభావమును జెఱచి వైచినది. ఆనాఁటి
రేయి భక్తుఁడు దేవార్చనములం పూర్తిగ నెఱవేర్చి
ఆభగవచ్చిహ్నములను భద్రపఱచునెడ, ఆవిగ్రహము
బొమ్మపయి సాలగ్రామశిల నుంచి పరుండెను.
మఱునాఁటి వేకువ నతఁడు దేవు నర్చించు, నుద్దేశ
ముతో రాఁగా సాలగ్రామము తునాతునుకలయి
దుమ్ముధూళి - వలె ధ్వస్తమయి క్రిందపడియుండుటం
గాంచి యాశ్చర్య పడియెను. అతఁడు దా నొనర్చిన
కలుషమునకుఁ దెలివిమాలినతనమునకు మిగులఁ బశ్చా
త్తప్తుఁడై ఆచార్యునికడకు క్షమింపఁగోరుట కరుదెం
చెను. వల్లభుఁ డాభక్తుని, సాలగ్రామశిలాధూళిని నీట
నానఁబెట్టి యానీటితో విగ్రహమున కభిషేకించిన
యథాప్రకారము శిలారూపము ఏర్పడఁగలదని
వచించెను. ఆ భక్తుఁడు ఆచార్యోపదిష్టము ననుసరింప,
మరల సాలగ్రామరూప మాధూళి వహించెను. భక్తి
యోగమును గూర్చి, ఆచార్యుఁడు పెక్కుగ్రంథములు
రచించెను. అందుఁ గొన్ని యింకను బ్రచురణ మంద
లేదు. అతఁడు శ్రీ చైతన్యమహాప్రభు-సమకాలికుఁడు
అతనిని వల్లభాచార్యుఁడు సందర్శించెను.

వల్లభుఁడు భగవత్సన్నిధికి వెడలుట, ఆసుతాను
యాయిలచరిత్రమున మహోత్తమమయిన పర్వదిన
ముగఁ బరిగణింపఁబడును. తన యవసానకాలము
నాతఁడు వారణాసిలోఁ గడపెను. అతఁడు
తన వచ్చిన కార్యము ముగిసెనని తెలిసికొనెను.
అట నొకనాఁడతఁడు హనుమాన్ ఘట్టమున
గంగలో స్నానముచేయ నేఁగెను. అప్పుడు అక్కడ
నున్న జనము కాంతిమండలమొండు భూతలమునుండి
యూకపమునకు వెడలుచుండుట నవలోకించిరి. ప్రజా
సందోహము గుమిగూడి కనుచుండ వల్లభుఁడు గగన
మార్గముననే యదృశ్యుఁడయ్యెను. అతఁడు, క్రీ॥ శ॥
1587 సం॥ నఁదన యేఁబదియవయేట నతఁడుస్వర్గధామ
మునలంకరించెను.

## మహాభక్తియోగ సిద్ధకవులు.
## వారి సిద్ధాంతములు

'సూరసాగరము' - అనుగ్రంథము రచించిన భక్తి
యోగి, వల్లభాచార్యుని ముఖ్యశిష్యుఁడు. అతఁడు
వైష్ణవమతశాఖ యగు శుద్ధాద్వైతసిద్ధాంతమును
స్థాపించినవాఁడు అతఁడు 'రునక్త' అనఁబడు రేణుకా
క్షేత్రమున 1540 సం॥న జన్మించెను. ఈవిషయమున
మఱొకయభిప్రాయమును గలదు. అతఁడు; ఆగ్రామం
నుండి మథురకుఁ బోవు రహదారినడుమఁ గల ఢిల్లీకి
సమీపమందలి 'శిబి' - యను గ్రామమునఁ బుట్టెనఁట.
"చౌరాశి వైష్ణవాంకివర్తా"ను అనుసరించి సూర్దాసు
సారస్వత బ్రాహ్మణుఁడనియు, అతని తండ్రిపేరు
రామదాసనియుఁ దెలియుచున్నది.

సూర్దాసు అంధుఁడు. కాని పుట్టుకతోడఁ గలిగినది
కాక, అతరువాత ఎప్పుడో సంభవించినట్లున్నది.
వల్లభాచార్యునిఁ దనకు దేశికునిగ 'గౌఘట్టము'చోట
అంగీకరించి, మంత్రోపదేశ మందెను. తన గురుదేవుని
ఆజ్ఞ ననుసరించి హిందీభాగవతమును పద్యరూపముగ
వ్రాసెను. భాగవతమందలిదశమస్కంధముప్రధానముగఁ
గైకొని 'సూరసాగరము'ను నిర్మించెను. అది తొలు
దొల్త వ్రాతప్రతిలో 1250 పద్యములు గలదియఁట!
కాని ప్రకృతము మనకు లభించు ముద్రితప్రతియందుఁ
బైఁజెప్పిన పద్యసంఖ్య చాలతక్కువఁగఁ గనఁబడు
చున్నది.

సూర్దాసునకు ఆఱుగురన్నదమ్ములుండిరి. కాని
వారు తమజనకుఁడొకప్పుడు మహమ్మదీయులతోడి
కలహములోఁ దవులొ్కనఁగా పితృవిముక్తికయి
యాతుఱకలతోఁ బోరి అసువులఁ బాసిరి. ఇది
జరిగిన కొన్నాళ్ళకు తల దాఁచుకొనుటకేని స్థలము
దొఱకక సూరదాసు దేశద్రిమ్మరివలెఁదిరుగఁసాగెను.
ఒకప్పుడు అతఁడు ప్రమాదవశమున ఒక పాడు
నూతిలోఁబడి దాని యట్టడుగున ఆఱుదినములు

రాత్రింబవళ్లు గడిపెను. ఏడవనాఁడు శ్రీకృష్ణభగవానుఁడతనికిఁ బ్రత్యక్షమయి, దృష్టి ననుగ్రహించి, తన సర్వోత్కృష్టమయిన రూపముతో తత్సన్నిధి నిలిచెను. అపుడు సూర్దాసు కృతజ్ఞతం జూపుచు,— శ్రీకృష్ణునింగాంచి— 'దేవా, నీదివ్యమంగళ విగ్రహమును సందర్శించిన పిదప ప్రాపంచిక వస్తువిలోకము సేయకుండునట్లు నాకను లెప్పటివలె నొప్పారున ట్లనుగ్రహింపు'— మని ప్రార్థించెను. తరువాత నతడు బావి నుండి వెల్వడి, మరల అంధత్వమును వరించి ధరించెను. అంత నతఁడు బృందావనమునకు జీవిత శేషము గడుప నరిగెను.

కరుణాంతరంగుఁడగు ఒకానొకమిత్రుని ప్రోత్సాహమున అతఁడు భగవంతుని, గొలువసాగెను. అందుచే అతనికి భగవత్సాన్నిధ్యము, అతిసులభమైనది. ఉద్ధవుడట్లవతరించె నని ప్రజలెల్ల రతనిగూర్చి భావించిరి. అతఁడు, వల్లభాచార్యుని కుమారుఁడు— అతని యనంతరము వచ్చిన పీఠాధిపతియు అగు 'గోస్వామి విఠలనాథుని సన్నిధిని దేహము చాలించెను. ఈగోస్వామి మహాకవులనుగఁ బరిగణించిన యెనిమిదిమందిలో సూర్దాసును అగ్రగణ్యునిగ భావించెను.

పద్యకావ్యముగ సూర్దాసు రచించిన సూరసాగరము హిందీకావ్యమున— శ్రీకృష్ణ జననము మొదలు అతఁడు మల్లురతోఁ బోరాడఁ గంసునిచే ఆహ్వానింపబడి మధురాపురికిఁ బయనించు వఱకు భగవాను జీవితము వివరముగ వర్ణింపఁ బడియున్నది. అందలి ప్రతి పద్యమును మధుర శబ్ద సందోహ సమానత్వమై, సరళ సమీచీన శయ్యాసంకలితమై, పాఠకులఁ దన్మయులఁ గావించు పాటవముతోఁ బ్రకాశించును. భగవల్లీలా విలాసామృత రస తుందిలమయి— భక్తుల లోఁగొనుటలో మివ్వల సమర్థమయినది. హృత్ప్రియ ప్రేమోత్కృష్టభావములును, జననీ జనకుల మీఁది మమకారమును ఈపద్యకావ్యము వలన అభ్యుదయమంది హిందీసాహిత్యమున నిట్టి కావ్య మిదివఱకు వెలువడలేదను ప్రఖ్యాతి కది తావలమయినది.

సూర్దాసు ఎక్కడికి వెడలినను, అతనితోఁగూడ నొకలేకరి యేఁగుచు, అతని వాక్కునుండి వెడలు పద్యములను పాటలను శ్రద్ధతో నాలించి గ్రంథస్థము చేసెడివాఁడు. పెక్కు తడవలు ఆవిలేఖకుఁ డతని ననుసరింప వీలుకానప్పుడు, శ్రీకృష్ణభగవానుఁ డావ్రాయసకాని కర్తవ్యము నెఱవేర్చెడివాఁడు. ఒకానొకప్పుడు, సూర్దాసు తన్ననుసరించు వాని అత్యంత నిశిత మత్యతిశయమును, తెలివితేటలను గాంచి అతఁడు తన నోటినుండి వచ్చియు రాక ముందే, తాఁ జెప్పనున్న విషయమును వ్రాయుచుండ నతఁడు తన్నెల్లప్పుడు వెంబడించుచున్నవాఁ డెవ్వఁడో మహాపురుషుఁడనియు, తనతోఁ దఱచుగ వచ్చుచుండిన విలేఖరిగాఁడనియు నూహించెను. స్వముఖోదిత పద్యముల వెన్వెంటనే ఎడతెఱపి లేక రచించుచుఁ బోవుట ఆపాతవాఁడగు లేకరికిని, భగవంతునకుఁ దక్క నితరులకు సాధ్యపడదనియు, అందువను తన లేఖకుని రూపుతోఁ బైకిఁ గనఁబడినను నిశ్చయముగ భగవంతుఁడే తనకు సాయపడుచున్నాఁడనియుఁ దీర్మానించికొనెను. వెంటనే సూర్దాసు భుజముపై వ్రాయసకాఁడు తన కరముంచి, ఏదియో చెప్ప నుంకించునంతలోఁ బరమేశ్వరుఁ డెవరో తన్నుఁ బిలిచినట్లు నటించుచు నటనుండి అంతర్హితుఁడయ్యెను. అట్టియెడ- అతఁడు భగవానునిగూర్చి చెప్పిన పద్య భావము ఈక్రింద నొసంగెదను :—

"నేను బలహీనుఁడనని యెఱింగి నాభుజముపై దృఢముగ ఆనించిన నీచేతిని దొలఁగించితివి. కాని, స్వామీ! నాహృదయమునుండి నీవెట్లు తొలఁగఁ గలవు. అట్లుచేసిననాఁడే నీవు శూరుఁడవని నేను జాటుదును."

ఇందులకు నాపద్యరూపానువాదము:-

'దేవఁ నామూఁపుపై మోపినావు చేయి,
అంతలో దుర్బలుఁడనని యెఱిఁగి, దానిఁ
దీసికొంటివి, సరె, నామదిం దొలంగి
యరిగినంగద శూరుండ వగుదువీవు॥'

(సశేషము)



ఓం సాయిరాం!



# శ్రీ సాయిబాబా భక్త సమాజం (రిజిస్టర్డు)

## షెణాయ్ నగర్, మద్రాసు - 30

# శ్రీరామనవమి మహోత్సవ సందేశము — 5-4-1960

---

## 'స్వామి కేశవయ్యాజీ'

శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ, ధర్మము నశించి అధర్మము పెచ్చుపెరిగిపోవు సమయమున తాను మంచిని రక్షించి, దుర్మార్గమును నిర్మూలించి ధర్మమును స్థాపించుటకు యుగయుగాలుగా అవతరించుచుందునని ప్రకటించెను. శ్రీరామచంద్రుడు అట్టి అవతారపురుషులలో నొక ఆదర్శమూర్తి. ప్రతియొక్కరికి మనదేశంలో ఆదర్శ మూర్తి, దివ్యపురుషుడు అయిన శ్రీరామచంద్రుని జన్మదిన మగుటచే యీరోజు పర్వదినము. శ్రీరాముడు బాధ్యతా నిర్వహణ నుద్దేశించి పితృవాక్య పరిపాలనార్థం సకల సంపదలను, రాజ్యాధికారమును విడనాడి వనవాసమున కేగెను. ఆయన బుద్ధివికాసముగల ప్రభువు; న్యాయం, సత్యం అమలుపరచుటలో సమర్థుడు; దయాసముద్రుడు. తన్ను శరణువేడి ఆత్మార్పణము చేసినవారికి తనంతట తానే ఆయన "నా శరణు జొచ్చినవారిని ఆపదలనుండి రక్షించుట నా ప్రతిజ్ఞ" అను మాటలతో అభయమిచ్చి రక్షించెను. శ్రీరాముడు ఎన్నడు అసత్యము పలుకని ధీరుడు. ఇట్టి ఉత్త మోత్తమమైన సుగుణములతో ప్రజల ప్రేమానురాగములకు శ్రీరాముడు పాత్రుడై సత్యస్వరూపుడుగా, ప్రేమమూర్తిగా గుర్తించబడెను. శ్రీరామచంద్రమూర్తి ప్రజలలో రాకుమారుడుగా అధర్మముతోటి, అసత్యముతోటి, దుర్మార్గము తోటి వీరోచితముగా పోరాడుటకు సకల సంపదలను, సుఖములను త్యజించి, 14 సంవత్సరములు వనవాసమును స్వీక రించి అనేక కష్టముల పాలయినను క్షత్రియధర్మ నిర్వహణను చాకచక్యముతో నిర్వహించి అనేక అగ్నిపరీక్షలకు గురియయ్యెను. త్యాగము ఆయన మాటలలోను, చేతలలోను జన్మించినది. ఆయన దివ్యచరితము రామాయణమందు సువర్ణపుటలలో ప్రకాశించుచు హిందూ ధర్మమును ప్రబోధించుచు మన జీవయాత్రకు మార్గదర్శకముగా నున్నది. శ్రీరామనామము తారక మంత్రముగా సర్వపాపహరముగాను, సకల దుఃఖహరముగాను నొప్పుచున్నది జగద్విదితము. శ్రీ త్యాగరాజస్వామి కీర్తించినట్లు మోక్షసాధనకు, బంధవిముక్తికి ఏకైకమార్గము భక్తి విశ్వాసములతో కూడిన భగవ త్ప్రార్థన. మన యేస్థితిలో నున్నను మనము శక్తికొలది శ్రీరామచంద్రుని అడుగుజాడల ననుసరించుటకు నిర్ణయించు కొనుటవలన యిది సుసాధ్యము.

మహాకవి వాల్మీకి కీర్తించిన రామాయణంలో ప్రత్యేకంగా శ్రీరామచంద్రుని అడుగుజాడల ననుసరించిన సీతాదేవి, లక్ష్మణుడు, భరత, శత్రుఘ్న, హనుమంతుడు, జాంబవంతుడు, శబరి, విభీషణులు పేర్కొనబడిరి. వారు విశిష్ట ధర్మానుసరణలో మనకు దివ్యజ్యోతులలాంటివారు. పక్షులవంటి జటాయువు, సంపతి, మృగములవంటి కోతులు, ఉడుతలు శ్రీరాముని సేవించి మోక్షమును సాధించినవి.

ఈరోజు శ్రీ సాయిబాబా భక్తులకు సుహాపర్వదినము. శ్రీ బాబా శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, శివుడు, మారుతి యిత్యాది రూపుడుగా వర్ణించబడెను. శ్రీ సాయిబాబా జీవితము పీడిత ప్రజానీకమునకు యుగయుగాలుగా మార్గము చూపిన దివ్యజ్యోతి. శ్రీ సాయిబాబా ఆదర్శమూర్తిగా భగవంతుని, భూమిని నిర్వచించెను. బాబా సిద్ధాంతరీత్యా

సర్వమత సమైక్యతను ప్రబోధించి, తన్నుదాహరణగా నిరూపించి, మన మేపేరుతో ఆరాధించినను భగవంతుడొక్కడే యని చాటెను.

శ్రీ సాయిబాబా పరబ్రహ్మ స్వరూపమయినప్పటికి, అవతార పురుషులైన శ్రీరామ, శ్రీకృష్ణులపట్ల శ్రద్ధా సక్తులతో ఆయన జీవితకాలంలో షిర్డీలో యీనాడు మహమ్మదీయులు జరుపు చందనోత్సవముతోబాటు జరుగు శ్రీరామనవమి ఉత్సవాలలో పాల్గొనెను,

ఈనాడు మానవకోటి కష్టపరంపరలకు అహంకార మమకారములు కారణము. ఇది విమాన, రేడియో, టెలివిజన్ యుగము మాత్రమేకాక అణు, ఉదజని బాంబుల, ఉపగ్రహాల యుగము. మానవకోటి మన పవిత్ర గ్రంథాలు నిర్దేశించిన ఆధ్యాత్మిక ఆదర్శాలకు క్రమంగా దూరమగుచున్నది. అధిక సంఖ్యాకులు జీవితములోని వాస్తవమైన ఆత్మానందాన్ని, దివ్యజీవనాన్ని విస్మరిస్తున్నారు. వారు హృదయంలో నిగూఢమై, పవిత్రమై ఆశా పాశములకు, క్రోధమునకు, ద్వేషమునకు, చలించని లోతులున్నవని గ్రహించలేకున్నారు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు పరస్పర సంబంధమువలన ఆశ జనించుచున్నదనియు, ఆశవలన కోపము, కోపమువలన భ్రమ, భ్రమవలన జ్ఞాపకశక్తి క్షీణము, జ్ఞాపకశక్తి క్షీణించుటవలన విచక్షణాజ్ఞానము నశింపు, విచక్షణాజ్ఞానము నశించుటవలన ఆత్మ విధ్వంసకము తటస్థించు చున్నదని చెప్పెను. ఆత్మనిగ్రహముతో ధ్యాననిమగ్నుడైన వ్యక్తి ఎట్టి ఆకర్షణకు గురికాక పరిపూర్ణ ఆత్మశాంతిని సాధించ గలడు. అట్టి శాంతితో పరమాత్మను ఐక్యమై అన్నిబాధలు నివారణయయి పరిపూర్ణానందము సమకూరును. మన జీవితాదర్శము కష్టమైనదయినా రాగద్వేషములవలన ఏర్పడిన హృదయమాలిన్యమును శుభ్రపరచుకొని, ఆత్మపరిశీలన చేసికొని, ఆత్మను పరమాత్మపట్ల భక్తితో నింపుకొనుట కావలెను. మనము విశ్వప్రేమను, భగవద్భక్తిని అభివృద్ధిపరచు కొనినచో పరమాత్మ సాక్షాత్కారమును శీఘ్రముగా పొందగలము.

శ్రీరామచంద్రుని జన్మదినమగు యీ మహాపర్వదిన సందర్భమున శ్రీరామునియొక్క, అతని అనుచరుల యొక్క ఆదర్శనీయమైన దివ్యజీవితమును, వారు ప్రపంచమునకు నేర్పిన గుణపాఠములను స్మరించెదము గాక! చిత్త శుద్ధితో వారి ననుసరించుటకు పరిశుద్ధమైన, సత్యసమ్మతమైన జీవయాత్ర సాగించుటకు, దుర్మార్గమును, క్రౌర్యమును ఎదిరించి, ప్రేమను, ప్రపంచ సౌభ్రాతృత్వమును ప్రోత్సహించుటకు ప్రతిజ్ఞ చేయుదుము గాక! ఈ క్రింది శ్రీ సాయి బాబా సూచనను పాటించి అనుసరించినచో మన జీవితలక్ష్యము సిద్ధించగలదు.

"దాహము గొనియున్నవారికి మంచి నీరిమ్ము; ఆకలిగొని యున్నవారికి ఆహారమిమ్ము; నగ్నముగా నున్న వారికి వస్త్రముల నిచ్చి, రోగులకు, అనాథులకు నీవు చేయగల సహాయముచేయుము. నీ సహాయము కోరివచ్చినవారిపై శంకలువేసి ఎన్నడును మనసు నొప్పించకుము. అతనిని సాదరముతో ప్రేమించుము. 'హరి'ని అతనిలో నేకాక వ్యాధి గ్రస్తమైన కుక్క, కాకి, చీమలలాంటి ప్రాణులలో సయితము చూడుము. భగవంతుడు మనకు ఏకైక రక్షకుడు. ఆయన యిష్టమునకు బద్ధుడవు కమ్ము. ప్రతి ప్రాణిలోను భగవంతుని చూచి వానిని ప్రేమించినచో భగవన్నిర్ణయము అమలు జరుగును. ముమ్మాటికి భగవంతుడు మనతోనుండి ఆశీర్వదించును. "శ్రీ సాయిరాం మనల నందర నాశీర్వదించి రక్షించుగాక!"

ఓంశాంతిః శాంతిః శాంతిః



# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గతసంచిక తరువాయి)

౧౯

సీతామనోహరా! శ్రీరామచంద్ర!
పద్మనేత్రుండ! విపన్న శరణ్య!
శ్రీ యయోధ్యానాథ! శ్రితజన వరద!
రాజేంద్ర! జగదీశ్వరా! రామభద్ర!
జేజేలు గొనుమయ్య! శ్రీ రమాలోల!
రక్షింపు భక్తుల - రక్తితో సతము

౨౦

కుడి, ధనుర్ధారియగు - లక్ష్మణుఁడు -
గొలువగ
మంగళాంగియౌ జానకి - రంగుగాగ
వామభాగంబు నందుండఁ బవనజుండు
ముందు నీయభయంబు - సానందముగను
పొందుచుండంగ, శ్రీరామ! పొలుపుతోడ
వెలయుచున్నావు; నాదు మ్రొక్కులను
గొనుము.

౨౧

రాక్షస మర్దనా! రఘునాథ! శ్రీ రామ!
రావణ సంహార! రామభద్ర!
వాలి విమర్దనా! భక్తుల కభయంబుఁ
జేకూర్చు శ్రీరామ! శ్రీ శుభాంగ!
భయహర! మురహర! పాపసంహార! సీ
తామనోహర! ముకుందా! పరాత్ప
రా! శార్ఙ్గధనువు - గరంబునఁ దాల్చిన
వీరాధివీర! సంప్రీతితోడ
జానకీదేవి నీ పాదజలజములను
సేవయొనరించు చుండు; సుగ్రీవుఁడిష్ట
రాజ్యములఁబొంది, సుఖియించె: రామ!
నన్ను
నిదఱికిఁ బిల్చుకొంచు, సమ్మోదమిమ్ము.

౨౨

సంసార భయముల - సంహార మొనరించు
పద్మాక్ష! శ్రీరామ భద్ర! వరద!
కోటి భాస్కర తేజ! కువలయ రక్షకా!
నీల మేఘశ్యామ! నిగమ వినుత!
కరధృతశరచాప! కల్యాణ గుణధామ!
కనకరుచిర వస్త్ర! కమలనాభ!
రత్నకుండల ధారి! రాత్రించర విదారి!
పాప హారి! మునిజనోపకారి!
లక్ష్మణుని గూడి, సతతంబు లాలితముగ
వెలయుచున్నావు శ్రీ రామ! వేదవేద్య!
జానకీ నాథ! శ్రీనాథ! సత్య చరిత!
స్తోత్ర మొనరింతు! రక్షింపు - శుభవిలాస!

౨౩

నల్లమేఘము వోలె - నల్లనై యున్నావు
నిర్మల పద్మాక్ష! నిగమ వినుత!
శాపమహల్యకు శాంతించె - నీపాద
పద్మముల్ సోకగా పంకజాక్ష!
భూమీశ! శ్రీరామ! భువనమోహన
రూప

కోటి విద్యుత్ప్రభల్ - గొలదిమీఱు
మకుటంబుఁ దాల్చిన - మహనీయమూర్తివి
సంసార దుఃఖముల్ - సమయఁజేసి
జీవులకు ముక్తిఁజేకూర్చు శ్రీశుభాంగ!
రాక్షసధ్వంస! హరసఖా! రామభద్ర!
నిన్ను ధ్యానింతు భజియింతు సేమము
గను!
ఇమ్మగా నాకు, నారోగ్య మిమ్ము దేవ;

౨౪

దశరథ వరపుత్ర! ధరణిజమిత్ర! దా
నవజైత్ర! మేఘ విన్నాణగాత్ర!
ఇంద్ర నీల శ్యామ! ఇనకులాభరణ! సీ
తాప్రాణనాథ! వేదగణ వినుత!
సకలలోకాళిచే - సంస్తోత్రుఁడై నావు
శ్రీరామభద్ర! విచారశీల!
శ్రీ సముద్రుండు, నిన్వాసిగా స్తుతియింప
భువనమోహన రూప! పొలచి నావు
దండకారణ్య సంచారి! దానవారి!
శ్రీరమేశ! సర్వేశ్వరా! శ్రీనివాస!
రామభద్ర! ధ్యానించెద - రక్తి తోడ
రక్షణము సేయుమయ్యా; ప్రహ్లాదవరద!

౨౫

సరయూనదీ తీర - పరిసరోద్యాన, ల
తాగృహసీమ, రతనపుటరుగు
నందుఁబువ్వుల శయ్యయందు, సీతారామ
దంపతుల్ క్రీడింతు రింపుగాగ
కస్తూరి, కర్పూర - గంధసమ్మిళితమా
పరిమళములచేత భాసమాన
మగు, శరీరములతో నమరవంద్యులుగ,
నా

దివ్యదంపతులుంద్రు సన్మతివి
పావనులు, శోభనాకార పరమ పూజ్యు
లాద్యు లత్యుదారమతులత్యంత కరుణ
మమ్ము నెల్లప్పుడును, రక్షణమ్మొనర్పఁ
బ్రార్థన మొనర్తు సద్భావభక్తితోడ.

౨౬

వందారు మందారుఁడింది వరశ్యాముఁ
డానందరూపుఁడై - యలరువాఁడు
భారతి, సంద్రంబు - వానరుల్ మొదలగు
వారి, సంస్తోత్రముల్ బడయువాఁడు
శ్రీ శివబ్రహ్మ, వశిష్ఠ విశ్వామిత్రు
లెల్లప్పుడు, నుతింపనెసగువాఁడు
విన తాత్మజుని చేత - వినుతులొందెడు
దేవతాధిపుఁడు, సీతావధూటి

మానస ప్రియుండు - మారుతాత్మజు సేవ
లందుకొనెడు వాఁడు - సుందరుండు
మాదు మనములందు మమతతో మలయాడి
సంతసంబొసంగ నెంతు మెపుడు.

౨౭

శ్రీ విశాల నేత్ర! సీతాకళత్ర! జ
గత్పవిత్ర! పూర్ణగాత్ర! రామ!
రక్షసాళి జైత్ర! రఘువీర! పరమాత్మ
తంత్ర! నా ప్రణతి శతంబు నీకు!

౨౮

లక్ష్మణుని భావపాథోధి లలితభంగిఁ
బొలుపు వహియించునట్టులు పొంగఁజేయు
పూర్ణచంద్రుండ వీవు! భూపుత్రి నేత్ర
కుముదములకు, సంతోషంబుఁ గూర్చినట్టి
పూర్ణచంద్రుండవు; ముకుంద! భూరితేజ
రాక్షసుల నేత్రపద్మముల్ - తక్షణంబ
ముకుళితమొనర్పఁజేసెడి - పూర్ణచంద్రుఁ
డీవు! శ్రీరామ! రక్షింపు మిందిరేశ!

౨౯

నీ పూజ లొనరింప - నేనేర రామ !
నీయవతారముల్ నేఁగొని యాడఁ
జాలను; సంసార జలధి దాటంగ
నీనామమేనావ ; నిను స్మరియింప
భవ బంధము తొలంగు - భద్రాద్రిరామ !
శరణు వేడితి ; రామచంద్ర ! ముకుంద !

౩౦

తుమ్మెదల బోలి నల్లనై - యిమ్ముగూర్చు
ముంగురులఁ గప్పఁబడినట్టి, మోముగల్గ
అల గృహాంగణమందుఁ దారాడుచున్న
బాలరాముండు, దశరథ వరసుపుత్రుఁ
డెప్డు, యశుభంబులడఁచి, మాకిచ్చుగాత
శుభపరంపర లేవేళ సొంపుగాగ

(సశేషము)

# బుద్ధావతారము

శ్రీ పేరి సర్వేశ్వరశర్మ

(గతసంచిక తరువాయి)

ఇక మూడవ ఆర్యసత్యము దుఃఖనిరోధము. పైన చెప్పిన దుఃఖములను నిర్మూలించుటవలన నిర్వాణము లభించగలదు. ఎందుకనగా కార్యము కారణము మీద ఆధారపడి ఉండును అట్టి కారణమును నిరోధించిన కార్యము తనంతట తానే నిరోధింపబడును. అన్ని దుఃఖములకు మూలకారణము అవిద్య. అవిద్యను విద్యవల్ల నిరోధించిన యెడల దుఃఖనిరోధము కల్గుతుంది.

ఇక నాల్గవ ఆర్యసత్యము దుఃఖనిరోధకమైన ఉపాయము. బుద్ధ భగవానుడు దుఃఖనిరోధానికి, ఘోరతపస్సులు, వ్రతాలు చేసి శరీరాన్ని శుష్కింపజేసే తాపసుల మార్గాన్ని, లేక సుఖసాధనాలనన్నింటి సేకరించి హాయిగా జీవితం గడిపేవాళ్ల మార్గాన్ని స్వీకరించక మధ్య మార్గాన్ని ప్రబోధించాడు. దానినే "మధ్యమ ప్రతిపదా" అంటారు. దీనికే అష్టాంగిక మార్గమనికూడ పేరు ఉన్నది. ఎనిమిది అంగములు ఏవియన, (1) సమ్యక్ జ్ఞానము (అటే ఆర్యసత్యములతత్త్వజ్ఞానము); (2) సమ్యక్ సంకల్పము (దృఢనిశ్చయమన్నమాట); (3) సమ్యక్ వచనము (నిజము పల్కుట); (4) సమ్యక్ కర్మాంతము (అంటే హింసద్రోహము, దుష్ట ఆచరణ లేనికర్మ) (5) సమ్యక్ ఆజీవము (అంటే న్యాయపూర్ణమైన జీవిక); (6) సమ్యక్ వ్యాయామము (అంటే చెడుగులను కల్గించకుండా మంచికొరకే ప్రయత్నించుట); (7) సమ్యక్ స్మృతి (అంటే చిత్తము, శరము, వేదన మున్నగువాటినుండి లభించు అనిత్యమైన, అశుచియైన, రూపములనుండేయు వేరు అగుట); (8) సమ్యక్ సమాధి (అంటే, రాగ, ద్వేషాది ద్వంద్వముల వినాశమువల్ల కలుగు చిత్తము యొక్క నైసర్గికమైన ఏకాగ్రత) పైనవర్ణించిన ఎనిమిది అంగములుగల మార్గాన్ని సరిగా అనుసరించిన జ్ఞానోదయమై నిర్వాణము లభించగలదు.

ఈ నాలుగు ఆర్యసత్యాలు బుద్ధమతానికి ఆయువుపట్టు అని, బుద్ధమతసారమని చెప్పవచ్చు. బుద్ధభగవానుడు నిర్వాణ ప్రాప్తికి చిత్తశుద్ధికి యజ్ఞయాగాలు చెయ్యమని కాని దేవతారాధనలు చెయ్యమని కాని తనమతానికి వేదాలు ప్రమాణమనిగాని యెచ్చటా చెప్పలేదు. అందుకనే వైదికులు ఆయనను నాస్తికుడని ఆయన మతాన్ని నాస్తికమతమనిఅన్నారు. కాల విద్వాంసులు చివరికి వస్తుతత్త్వాన్ని గుర్తించారు. హింసా మార్గంలోపడి కొట్టుకొంటూ ఉన్న మానవసమాజాన్ని ఉద్ధరించడానికి భగవంతుడే గౌతమ బుద్ధుడై ఉదయించాడని తెలుసుకున్నారు. అందుకనే ఆయనను దశావతారాలలో ఒకనిగా పరిగణించారు. అదేమనభారతదేశం యొక్క గొప్పతనము.

పై నాలుగు ఆర్యసత్యాలను బాగా పరిశీలిస్తే బుద్ధభగవానుడు బోధించిన మార్గము ఉపనిషత్ప్రతిపాదితమైనమార్గముకంటె వేరుకాదు. "ఋతేజ్ఞానాన్న ముక్తి" అని ఉపనిషత్తులలో బోధింపబడిన సిద్ధాంతము బుద్ధునకు అన్నివిధములా అంగీకారమే కాని జ్ఞానమును ధరించు శక్తి శరీరములో లేనంత వరకు అది ఉదయించనేరదని జ్ఞానోత్పత్తికి శరీరము యొక్క బాహ్యాభ్యంతరశుద్ధి ముఖ్యమని ఆయన మతము. అందుకనే బుద్ధభగవానుడు శీలమువల్ల శరీరశుద్ధి సంపాదించవలయునని నొక్కి వక్కాణించాడు. ఈ శీలములు అయిదు. (1) అహింస; (2) అస్తేయము (దొంగతనము చేయకుండుట); (3) సత్యభాషణము (నిజముపల్కుట); (4) బ్రహ్మచర్యము, (5) మదిరావర్జనము (మత్తుపదార్థములను సేవించకుండుట ; పై అయిదు శీలములను ప్రతి బౌద్ధుడు ఆచరణలో పెట్టాలి. వీటినే పంచశీలములు అంటారు. వీటి ఆధారంపైననే మనదేశం నేడు ప్రపంచ శాంతికొరకు ఇతరదేశాలతో "పంచశీల్" అని చెప్పి అయిదు ఒప్పందాలు చేసుకున్నది. పై అయిదు శీలములేకాక ప్రతి బౌద్ధభిక్షువు ఆచరించవలసినవి, మరి అయిదు శీలములున్నవి. అవి, (1) అపరాహ్ణకాలమందు భోజనము చేయకుండుట!

(2) పూలమాలలను ధరించకుండుట; (3) సంగీతము వినకుండుట ; (4) బంగారము, వెండి వాడకుండుట; (5) పందిరి పట్టెమంచాలను విడచుట ; బౌద్ధ భిక్షులు మొత్తమీద పదిశీలాలు ఆచరించాలి.

నిర్వాణ ప్రాప్తికి శీలము లేకాక, సమాధి, ప్రజ్ఞ అనుమరి రెండు సాధనములుకూడ బుద్ధదర్శనములో వర్ణింపబడినవి. సమాధియొక్క అభ్యాసమువల్ల పూర్వజన్మస్మృతి, వినాశజ్ఞానము, మరియు చిత్తమును అవరోధించే విషయాల జ్ఞానము కలుగుతాయి.

ఇక ప్రజ్ఞ మూడు విధములు :-

(1) శ్రుతమయి (ఆప్త ప్రమాణమువల్ల కల్గిన నిశ్చయ జ్ఞానము; (2) చింతామయి (యుక్తివల్ల కల్గిన నిశ్చయము) (3) భావనామయి (సమాధివల్ల గల్గిన నిశ్చయజ్ఞానము)

శీలసంపన్నుడై శ్రుతము, చింత, అను రెండు ప్రజ్ఞలతోను కూడిన వ్యక్తి భావన అను ప్రజ్ఞను సాధించుటకు అధికారి అవుతాడు. ప్రజ్ఞానుష్ఠానంవల్ల, జ్ఞానదర్శనము, మనోమయశరీరనిర్మాణము, దివ్యనేత్రములు, దివ్యశ్రోత్రములు, పరచిత్తజ్ఞానము పూర్వజన్మస్మరణము మున్నగునవి కలుగ పిదప దుఃఖక్షయమైనదను జ్ఞానము కలుగుతుందని బుద్ధ భగవానుడే చెప్పినాడు.

ఈ విధంగా శీలము, సమాధి, ప్రజ్ఞ ఈ మూడు బుద్ధమతసారమని చెప్పవచ్చు ఈ విధముగా భగవంతుడు కలియుగములోని ప్రజలు హెచ్చు అధర్మాచరణపరులుగా ఉంటున్నారని తెలుసుకొని వారిని ధర్మమార్గములోనికి తీసుకొని వచ్చుటకై బుద్ధావతారం ఎత్తి దేశకాలపాత్రానుసారముగా సదాచార మార్గమును చూపాడు.

## కల్కి అవతారము

భగవంతుడు ఎన్నిసార్లు అవతారాలెత్తి ఎన్ని ధర్మప్రబోధలు చేసినా మానవులు మరికొంత కాలానికా ప్రబోధలను మరచిపోతూ ఉంటారు. మనం మరచిపోయినా మహాదేవుడు సర్వదయామయుడు కాబట్టి శ్రమ అని తలచక క్రొత్త అవతారాల ఎత్తుతూ ఉంటాడు. ఇది కలికాలము. ఇప్పటికే చాల పాపం పెరిగింది. పురాణాలలో వర్ణించిన కలికాల ధర్మాలన్నీ గోచరిస్తూ ఉన్నాయి. అందరు అన్న విక్రయులయి పోతున్నారు. మనం రోజూ చేయవలసిన పంచమహాయజ్ఞాలలో అతిథియజ్ఞం ఒకటి. ఈ కాలంలో హోటలు వాళ్లు తప్ప అతిథియజ్ఞం చేసే గృహస్థులరుదు. గీతలో వర్ణించిన అసురీవృత్తి ప్రజలలో నాట్యమాడుచున్నది. ఇతరులను మోసగించి ధనార్జన చేయనివారిని "సత్యకాలం మనిషి ఇతడు" అంటున్నారు. పరాతి సంధానమే విద్యగా ఉన్నది. ఇంకా ఇది కలియుగము మొదటి పాదము. కలియుగము నాల్గవపాదములో అధర్మము బాగా పెరుగుతుంది. ధర్మం పూర్తిగా నశిస్తుంది. అప్పుడు శ్రీమన్నారాయణుడు కల్కి అవతారము ఎత్తి మ్లేచ్ఛులను నాశనముచేసి వర్ణాశ్రమ ధర్మాలను మరల స్థాపించి ప్రజలను సన్మార్గములో ప్రవర్తింపజేస్తాడు. "యథాధాతా పూర్వమకల్పయత్" అని మరల కృతయుగాదులు ప్రారంభమవుతాయి. మరల భగవంతుడు అవతారాలు ఎత్తడం ప్రారంభిస్తాడు. అనాద్యనంతంగా సంసార యాత్ర సాగుతూనే ఉంటుంది. అధర్మం చేయుటకు మనకు విసుగు లేదు. అవతారాలు ఎత్తుటకు ఆ జగన్నాథునకు విసుగు లేదు. ఇది అంతా ఆయన లీల.

# ప్రేమ

**శ్రీ ఎ. సి. శేఖర్**



ప్రేమ శబ్దాన్ని నిర్వచించడం, ఆ శబ్దానికి అర్థం తెలియచేయడం అసాధారణము. ప్రేమ అనేది అనిర్వచనీయమైన ఆకర్షణ. ప్రేమలో పడ్డ ప్రతివ్యక్తి శారీరకంగా కాకపోయినా, మానసికంగా కొన్ని ఆవేదనలకు, ఆందోళనలకు గురి అవుతాడు. అటువంటి నిర్భాగ్యజీవులే సార్వతీదేవదాసు, లైలా మజ్నూ, అనార్కలీసలీములు.

ప్రేమ అనేది ఒక మానసికాకర్షణ. ఆయాకర్షణకు కారణాలంటూ ఉండవు. ఉదాహరణకు ఒక వ్యక్తి మరొకవ్యక్తిని ప్రేమించాడంటే ఆ వ్యక్తిలోని అందాన్ని మాధుర్యాన్ని పొందాలనిగాదు; అట్టివి పొందదలచిన ప్రేమ కానేకాదు. అది కామము. ఇప్పటి నాగరికులు ప్రేమనర్థం చేసుకొనలేక దాన్ని కళంకంజేస్తున్నారు. వారు దానిని కామము యొక్క నామాంతరముగా భ్రమిస్తున్నారు. ఇది చాల పొరబాటు. ప్రేమ నిష్కళంకమైనది.

ప్రతి వ్యక్తిలోను, ప్రేమ నిబిడీకృతమై ఉండాలి. ప్రేమలేనివాడు మానవుడు కాడు; దానవుడు. ప్రేమే దైవస్వరూపం. "Where is love there God is" నీవు నీ ప్రత్యక్ష పరోక్షముల నున్న ప్రతివ్యక్తిని, వస్తువును, ప్రేమించు. కాని కామించకు. మానవుడు అన్నింటిని ప్రేమించలేడు. కష్టమును శత్రులను, అపజయమును ప్రేమించడు. అలా ప్రేమించిన వాడు ఒక్కడే, "భగవంతుడు." మానవుని లోనే అట్టి నిర్మల ప్రేమ ఉంటే భగవంతుని ఆశ్రయించి పూజచేయవలసిన అవసర మేల కలుగుతుంది ?

తాను ప్రేమించిన వస్తువును ఏ వ్యక్తి కోరడు ; కాని ఆవస్తువు లేక ఆవ్యక్తికి ఏ ఆపదా రాకుండా వేయి కళ్లతో చూస్తుంటాడు. ఆవ్యక్తి జీవనంకోసం, ఆవ్యక్తి ఉన్నతత్వంకోసం, సుఖంకోసం తన జీవితాన్ని గూడ అంకితం జేయ సిద్ధముగా నుంటాడు. కాని ఆ వ్యక్తి తన దగ్గరకువస్తే అతనేం జేయగలడు ? ఆ వ్యక్తితో మాటలాడగలడా? ఆ వ్యక్తిని స్పృశించగలడా ?? కనీసం ఆవ్యక్తిని కళ్లారా చూడగలడా? ? ? ఏమీ లేదు; ఆవ్యక్తే తన కండ్ల ఎదుటగాకుండా దూరముగానుంటే, అతను ఎంతో విలపిస్తాడు. ఎన్నెన్నో ఆలోచించుకుంటాడు. ఆ వ్యక్తితో మాటలాడాలనీ ... యోగక్షేమాలను గూర్చి తెలిసికోవాలని ... ఇంకా ఎన్నో విధాలుగా ఆలోచిస్తాడు – కానీ – ఆ వ్యక్తే తన ఎదుటకు వస్తే ఏమీ చేయలేడు. ఆలోచనలన్నీ గాలి మేడలవుతాయి. ఇందులకడ్డంకి సంఘముగాదు, అతని మనసు. అతని మనస్సంతా తాను ప్రేమించిన వ్యక్తియందే లగ్నమై యుంటుంది. కళ్లు చూస్తుంటాయి - కాని అంతా శూన్యం. అతను వెంటనే తను ప్రేమించిన వ్యక్తినుండి దూరముగానుండా

లనీ యోచిస్తాడు. మనస్సు వ్యాకుల పడుతుంది. కండ్లనుండి అశ్రుధారలు ప్రవహిస్తాయి. కాని - అతను చేసేదేమేటి ?

తాను ప్రేమించిన వ్యక్తి తనను ప్రేమించనీ ప్రేమించకపోనీ తననొక నీచునిగాను, దుర్మార్గునిగాను ...... యింకా యెన్నో విధాలుగా తలచినను అతడు మాత్రము వానిని ప్రేమాంజలుగానే స్వీకరిస్తాడు. ఆ వ్యక్తి మూలముగా తన జీవితం నాశనమయినను, నలుగురిలోనగుబాటయినను అతడు మాత్రం వాటిని లక్ష్యపెట్టడు. అదే ప్రేమలోని మాధుర్యం.

తాను ప్రేమించిన వ్యక్తి తన ఎదుటుండేటప్పుడు ఆతడు ఆ వ్యక్తిని ప్రేమిస్తున్నాననే భావించడు. కాని ఆ వ్యక్తే తనకు దూరంగా ఉన్నప్పుడు విరహవేదనతో ప్రేమ ద్విగుణీకృతమగుతుంది. ప్రేమకంటె మాధుర్యమయినది విరహమే. ఈ ప్రేమే స్త్రీ పురుషుల మధ్యగాక, ప్రతీ జీవరాశులమధ్య, జీవ నిర్జీవుల మధ్య, పిన్నా పెద్దల మధ్య వ్యాపించియుంటుంది. అట్టి నిర్మల ప్రేమను నాగరికులు కల్మష భావాలతో, వ్యాఖ్యానించడం శోచనీయమే.



# సదాచార సూత్రములు

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

( మార్చి సంచిక తరువాయి )

67. ఉత్తమ వస్తువులనూ సద్విద్యను సంగ్రహించునట్టి మానవులు సమయమొస్తే ధైర్యహీనుడు కాడు.
68. విచారశీలుడైన ఉత్తమ పురుషుడు అన్యులుచెప్పే మాటలన్నీ వింటాడు కాని నిజ సదాలోచనానుసారమే కార్యాన్ని సాధిస్తాడు.
69. భూతకాలంలో జరిగిన అపరాధాలపై పశ్చాత్తాపంచెంది భవిష్యత్తులో అట్లు చేయకుండునట్లు ప్రతిజ్ఞచేయ్యాలి.
70. నిత్యం నియమంగా విద్యాభ్యాసం చేయడంవల్ల శీఘ్రసాఫల్యంకలుగుతుంది.
71. తల్లి, తండ్రి, గురువులను ఆదరించినట్టి బాలుడే విద్వాంసుడౌతాడు.
72. బాల్యావస్థలో విద్యను, యౌవ్వనావస్థలో ధనాన్ని, సంపాదించని మానవుడు వృద్ధాప్యంలో మహా దుఃఖాన్ని పొందుతాడు.

# "ఈ బీదరాలిని తల్చుకొంటూ వుండు, ప్రభా!"

శ్రీమతి కమలా గిరిధర్

"ఏమండీ, మీరీ కథ చదివారా?" పత్రిక చేతికిస్తూ అడిగింది ప్రభ.

"ఏం కథ... ఓహో నువ్వు వ్రాశావా?" కొంటెగా చూస్తూ అన్నాడు శివప్రసాద్.

"ఏం? - వ్రాయకూడదేమిటీ! అంతటి విచారం వెళ్లబుచ్చుతున్నారు" అని బుంగమూతి పెట్టింది ప్రభ.

"ఊఁహుఁ అందుక్కాదు; పత్రికా ప్రపంచానికి ఎంత దౌర్భాగ్యం పట్టుకుందా అని..."

"అదిగో చూశారా, అక్కడకూడా మీ ఆధిక్యత చూపాలనే మీ తాపత్రయం. అందుకే నేనంటాను, స్వార్థానికి మారుపేరే పురుషుడు".

"చాల్లేదూ. అప్పటికి ఆడవాళ్లంతా మహా నిస్వార్థపరాయణులైనట్టు...ఆఁ ఇంతకూ నువ్వేమన్నావ్?"

"ఈ కథలో ఓ ప్రత్యేకతకూడా వుందండీ. అందులోను ఇది మా క్లాసుమేటు వ్రాసింది".

"ఓ, అందుకనే బాగుందంటున్నావ్".

"అదేం కాదులెండి. మీరు ముందు చదవండి చెప్తాను".

"నువ్వు చెప్పేది బావుంది కాని, కప్పు కాఫీ యివ్వందే నావల్ల కాదు బాబూ. ఊఁహుఁ కథే నడవదు".

కథకూ కాఫీకి సంబంధం ఏమిటండీ? ఇప్పుడేగా తీసుకున్నారు?"

"నీకు తెలీదులే ప్రభా. ఈమధ్య కొన్ని కథలు వస్తున్నాయి. కాఫీ సేవించకపోతే - బుర్ర బద్దలైపోయే ప్రమాదం కూడా వుంది వాటిల్లో".

"అయ్యో, అయితే తెస్తాన్లెండి" అని నవ్వుతూ రివ్వున వంటగదిలోకి పరుగుతీసింది ప్రభ.

ప్రసాద్ దృష్టిని కథమీదికి మళ్లించాడు. పత్రికలో మొదటి కథపేరు 'ప్రేమార్పణ' — రచయిత్రి 'రమ'. ఈ పేరు ఎక్కడో తను విన్నట్టు జ్ఞాపకం. ఎక్కడ? ఎప్పుడు?...ఆఁ అదే — ఆనాడే — అవును - అప్పుడే తను మర్చిపోగలడా? గుండెల్లో ఏదో పోటు పుట్టింది. మనసులో ముళ్లకర్రపెట్టి దేవినట్లనిపించింది. ఆతురతతో కథ చదవటం మొదలెట్టాడు ప్రసాద్. మొదటి వాక్యంలోనే ఏదో ఆవేశం వున్నట్లు కనిపించింది. భ్రమకాదు. ఎవర్తో అగోచరహస్తం ఛెళ్లున తన చెంప వాయించినట్లు ధ్వనించి అదృశ్యమైపోయింది. ఏమిటీవిచిత్రం. తన మనసులో ఈ కలవరమేమిటీ?... తను చేసిన నేరమేమిటీ?

కథ మంచి రసఘట్టంతో ప్రారంభమైంది. "తప్పకుండా వస్తారు కదూ. మీకోసం నిరీక్షిస్తూవుంటాను" అంటుంది ఒక ప్రియురాలు. "నామీద విశ్వాసం లేదా రమా! నేను నిన్ను మోసం చేస్తానా? అలా చేస్తే మళ్లీ నీ మొహం చూడగలనా? నేను బ్రతకగలనా" అని ఓదార్చి ధైర్యం చెబుతాడు ప్రియుడు. ఇవీ కథలోని మొట్టమొదటి డైలాగ్సు. ఆ తర్వాత కథ సాఫీగా సాగిపోయింది. కథ చదువుతున్నంతసేపూ తను పుస్తకం చదువుతున్నట్టు లేదు ప్రసాదుకు. వాస్తవ జీవితాన్ని యథాతథంగా ఛాయాచిత్రం తీసి చూపుతున్నట్లనిపించింది. ఆకథలో యిద్దరి వ్యక్తుల జీవితసారం ఇమిడివుంది. ఆ కథకు ప్రాణం వుంది. ఆ కథలో వున్న వ్యథ, జీవితంలో సుధారస పానానికి నోచుకోని అభాగ్యుల్ని జ్ఞప్తికి తెస్తుంది.

కథ విషాదాంతంగా ముగిసింది. ప్రియుడే తన సర్వస్వంగా నమ్మిన ప్రియురాలిని నిర్దాక్షిణ్యంగా వదిలేసి పారిపోతాడు. ఆమె బ్రతుకు బండలవుతుంది. ఆమె కోర్కెలు నీటి వ్రాతలై, ఆమె వూహలు గాలిమేడలై కూలిపోతాయ్. వెలుగును వెతుక్కొంటూ చీకట్లో కలిసిపోతుంది ఆ అభాగిని. కథలో అసహజత్వానికి ఎక్కడా చోటులేదు. ఆత్మ సమానంగా ప్రేమించిన అబలలను, పడతుల్ని నమ్మించి నాశనంచేసే పిరికి ప్రేమికులు, కర్కశహృదయులు ఎందరులేరు? ఈ ప్రశ్న

తనలో ఉదయించగానే ప్రసాద్ సిగ్గుతో తలవంచుకొన్నాడు. తన మహాపరాధాన్ని తలుచుకొని బాధపడటంకన్న, గుండె ఒక్కసారి వెయ్యిముక్కలుగా చీలిపోతే బాగుండుననిపించింది. "నీకు ద్రోహం చేశాను. రమా! నమ్మినిటికి నేను పిరికివాడ్ని" అని తనలో తాను ఎన్నోసార్లు రమను క్షమార్పణ చెప్పుకున్నాడు. రమ క్షమిస్తుందా తనలాంటి వంచకుడ్ని! మళ్లా మొహం ఎత్తి చూస్తుందా? ... ఎక్కడుందో పాపం రమ ... ఏమైపోతుందో తనని ...నాకోసం ఎన్ని కష్టాలో?...

ప్రసాద్ స్మృతిపథంలో రమతో గడిపిన మధుర క్షణాలు జ్ఞాపకానికి వచ్చాయి. ప్రసాద్ హృదయం వేగంగా కొట్టుకోసాగింది. ఏదో బాధ, చెప్పరాని ఏదో అనుభూతి అతన్ని పిచ్చివాడినిగా చేశాయి. కళ్లలో నీళ్లు తిరిగాయి. అలాగే కన్నీళ్లు కార్చుతూ ఎంతసేపు అలా ఉండిపోయాడో అతనికే తెలీదు.

"ఏమండోయ్. కథచదివారా? అదేమిటండీ, కుర్చీలో అలావాలిపోయ్యారు!" అంటూ కాఫీ కప్పుతో దగ్గరికొచ్చింది ప్రభ. భర్తగాన్ని చూసి తను విస్తుపోయింది. "ఇదేమిటీ, ఏడుస్తున్నట్టుందే" అని ప్రసాద్ చిబుకాన్ని పట్టి పైకెత్తింది. ఆశ్చర్యంతో.

ప్రసాదు ఈలోకంలోపడి "ఆఁ ఏమీలేదు. ఏదో జ్ఞాపకం వచ్చి" — అన్నాడు

"నాకు చెప్పరానిదా?"

"అదేంకాదు. అది చెప్తే నన్ను నీవు క్షమించవేమో"

"ఛీ. అదేమిటండీ వింతగా మాటాడుతారూ!"

"మీ స్నేహితురాలెవరోగాని మంచి కథే రాసింది. నూరుపాళ్లు నాకథే"

"మీరుకూడా ఎప్పుడైనా అలాగా ఒక అమ్మాయిని ......"

"అవును ప్రభా, నాజీవితంలో మరుపురాని ఘటనఅది. నువ్వు భరించగలిగితే చెబుతా"

"చెప్పండి — నేనేమీ అనుకోను. ఎప్పుడూ మీదాన్నేకదా" అని ప్రభతొందరచెయ్యడంతో, ప్రసాదు తనగత జీవితాన్ని చెప్పడం మొదలెట్టాడు.

◆ ◆ ◆

ఇప్పటికి పదేళ్లక్రిందటిమాట. నేను గుంటూర్లో బి. ఏ. చదువుతున్న రోజులవి. గుంటూర్లో నాకు బంధువులెవరు లేకపోవటం మూలాన కాలేజి దగ్గరగా ఒకరూమును అద్దెకుతీసుకొని, ఒంటరిగా చదువుకునేవాడ్ని. అప్పటికి నాకెవరూ స్నేహితులు కాలేదు గుంటూర్లో. మనుష్యుల్ని కులుపుగా పరిచయం చేసుకొనే స్వభావం నాలో లేకపోవడం ఇతరులతో కలిసిమెలసి తిరగకపోవడంచేత ఆరు నెలల కాలంవరకు గుంటూరు నాకు క్రొత్తగానే ఉండేది. కాలేజివదిలితే రూము, రూము వదిలితే కాలేజి - యివిరెండే నా ప్రపంచం ... ఎప్పుడైన మరీ విసుగ్గావుంటే షైర్ వెళ్లే వాడ్ని అంతే. నా రూముకు ప్రక్కనే యింటియజమాని వుంటున్నాడు. ఆయన భార్య, ఆయన మేనకోడలు అంతే వాళ్ళ సంసారం. పరంధామయ్య చాల పెద్ద మనిషి. నాతో ఎప్పుడూ సాదరంగా మాటాడేవాడు. అప్పుడప్పుడు నారూమ్ కొచ్చి "ఎప్పుడూ చదువేనా? కాసేపు అలా షైర్ వెళ్లిరా బాబూ" అని నవ్వుతూ హెచ్చరించే వాడాయన. నాకు ఆయన మాటమీద ఎనలేని గౌరవం. ఆయన భార్య రత్తమ్మ కూడా అంత ఉత్తమురాలు. నాకేమైనా కావాల్సి వస్తే నిర్భయంగా అడగమని చెప్తుండేది. ఆమెను చూస్తే చనిపోయిన మా మామ్మ నాతో మాట్లాడుతున్నట్లు అనిపించేది. ఆ దంపతులకు పిల్లలేరు. మేనకోడలు "రమ"ను చిన్నప్పట్నుంచి చేరదీసి పెంచుకొంటున్నారు. ఆమెకు పద్దెనిమిదేండ్ల వయస్సుంటుంది. సన్నగా వుంటుంది. చామన ఛాయ. తీర్చిదిద్దినట్లు అంగసౌష్టవం. ఆమె ఎంతో ఆకర్షణీయంగా వుంటుంది. ప్రొద్దున్నే నిద్ర లేవగానే ఏదోపని చేసుకొంటూ 'రమ' నాకంటబడేది. ఆ వికసితవదనం చూస్తేనేగాని నాకదొక తృప్తి అనిపించేది కాదు. నాలో నూతనశక్తి, నూతనోత్సాహం ఆవిర్భవించేది. ఎందుచేతనో చెప్పలేను. ఆ దృశ్యం చూడలేకపోయినప్పుడు అమూల్యవస్తువు ఏదో పోగొట్టుకున్నట్టు బాధపడేవాడ్ని. రమ నాతో మాట్లాడేది కాదు. నేనామెను చూస్తున్నప్పుడు బదులుగ ఒక్క చిరునవ్వు మాత్రం నవ్వి తుర్రున పారిపొయ్యేది—అంతే. మాదొక మూగభావ.

రమ స్కూల్ ఫైనల్ చదువుతోంది. నాతో పాటు ఆమె పదిగంటల దాకా చదువుతూ వుండేది. నా గదిలో లైటు ఆర్పివేయడం చూస్తేనేగాని, ఆమె పుస్తకాలు కట్టిపెట్టి పడుకొనేదికాదు. ఆమె పట్టుదలకు నాకు నవ్వొచ్చేది.

రమతో మాట్లాడాలని కోర్కె గాఢం అయ్యే కొద్దీ 'రమ' నాకు దూరంగా వుండిపోతూ వచ్చింది. ఎన్నోసార్లు వాళ్లింటికి వెళ్లి పరంధామయ్యతో మాట్లాడటం జరిగింది. కాని, రమ నన్ను చూసి లోపలికి జారుకునేది. అంతట నాలో వుత్సాహమంతా చల్లారిపోయేది. నన్ను చూస్తే ఏం భయం? చదువుకొన్న స్త్రీలుకూడా మగాళ్ళను చూస్తే అలా భయపడి పారిపోతారెందుకని నాలో నేను విసుక్కునేవాణ్ని.

ఒకనాడు నాగది వూడ్చే పనిమనిషి రాలేదు. దాహం పుట్టింది. కూజాలో నీళ్లులేవు. పరంధామయ్యగారింటికి వెళ్లాను. వాకిట్లోనుంచే "రత్తమ్మగారూ!" అని పిల్చాను. ఆమె పలకలేదు. లోపలనుంచి జవాబైనా రాకపోవడం నాకు చిరాకు వేసింది. మళ్లీ పిల్చాను. "రమ" సిగ్గుపడుతూ దగ్గరకొచ్చి "ఇంట్లో లేరండీ" అంది మృదువుగా. "నాకు కాసిని మంచినీళ్లిప్పిస్తారా?" అన్నాను నేను ధైర్యంగా ఆమెవైపు చూస్తూ.

రమ లోపలికి వెళ్లి గ్లాసునీళ్లు తెచ్చిచ్చింది. ఆమెతో కొంతసేపు మాట్లాడాలనిపించింది. కాని, ఏం మాట్లాడుతాం అలా భయపడి రమ పారిపోతూంటే?

గ్లాసు ఆమె చేతికిస్తూ "పరంధామయ్యగారు లేరా?" అన్నాను.

"లేరు. పొలానికి వెళ్లారు" అంటూ తిరిగి చూడకుండా లోపలికి పరుగుతీసింది.

ఇంకేమిటీ, రమతో నేను మాట్లాడేది? గుట్టుగా యివతల కొచ్చేశాను. 'రమ'తో స్నేహం చెయ్యాలనే కోర్కెమాత్రం నాలో రోజురోజుకు బలీయం కాజొచ్చింది. రమమీద నాకెట్టి దుష్టకోర్కెలు లేవు. కాని, ఆమె నా ప్రక్కగాచేరి ముద్దుగ మాట్లాడుతుంటె వినాలని మాత్రమే నాకుండేది. అంతకంటే మరేవాంఛా లేదు.

రోజులు అలాగే గడిచిపోతున్నాయి. డిశంబరు దాటి జనవరి ప్రవేశించింది. రమలో మాత్రం మార్పు రాలేదు. నేను రెండుమూడు సార్లు ఏదో మిషతో పల్కరించి విఫలుణ్నయ్యాను. ఆమె ముక్తసరిగా సమాధానమిచ్చి జారుకుపోయింది.

ఒకనాడు గదిలో చదువుకొంటూండగా రత్తమ్మగారు వచ్చింది. "చూడు నాయనా, నువ్వేమీ అనుకోకపోతే నేనొక మాటంటాను" అంది.

నేను భయపడిపోతూ, ఏంచేశాను భగవంతుడా అని క్షణం ఆలోచనలో పడ్డాను. దిక్కుతోచక, "చెప్పండి దానికేం" అన్నాను.

"మరేంలేదు నాయనా! మా రమ వొట్టిపిచ్చిది. ఇన్నాళ్లనుంచి నువ్విక్కడుంటే, అది నీతో మాట్లాడానికి భయం చూశావా? దానికి క్లాసులో లెక్కలు కష్టంగా వున్నాయట..." అంటూ ఆగిపోయింది.

నేనందుకొని "దానికేముందీ, నన్నడిగితే చెప్పనూ?" అన్నాను.

"అదే నాయనా, ఆమాటే అన్నా. దానికి వల్లమాలిన సిగ్గు. నామాట వింటేగా. ఇప్పుడు మాత్రం ఒప్పుకుందనా, అబ్బో" అంటూ నవ్వింది రత్తమ్మ.

కూతుర్ని పిల్చి "విన్నావుగా? తెలియని లెక్కలు చెప్పించుకో బాబుదగ్గర" అని నాకప్పగించింది. ఆవేళనుంచి రమ నాగదికి వచ్చి లెక్కలు చెప్పించుకొంటూండేది, నన్నామె "అండీ" అని సంబోధించడం నాకు చిరాకు పుట్టింది. ఒకసారి "నాకు ప్రసాద్ అని తల్లిదండ్రులు పెట్టిన పేరుంది" అన్నాను కోపంగా. పాపం రమ భయపడిపోయి క్రమంగా నన్ను పేరుపెట్టి పిలవడం అలవాటు చేసుకుంది.

మా యిద్దరిమధ్య చనువు ఏర్పడ్డానికి చాలకాలం పట్టింది. రమ స్నేహంతో నేననుకొన్నంత అమాయకురాలు కాదనిపించింది. చలాకీగా మాట్లాడేది. నేనూ ఆమెముందు ఏ విషయం చెప్పడానికీ భయపడేవాడిని కాను. అలా స్నేహం బలపడిపోయింది.

ఇద్దరికీ పరీక్షలైపోయాయి. సెలవుల్లో ఊరు వదిలిపోవడానికి నాకు మనసు రాలేదు. కాని, మూడునెలలు యిక్కడ వుండిపోవడానికి ఒప్పుకుంటాడా నాన్న? ఎందుకంటే ఏం చెప్పడం?

"నేను రేపే ఊరు ప్రయాణం, రమా" అని చెప్పాను. రమ మొహంలో కాంతిని కోల్పోయింది. చిరుకోపం ప్రకటిస్తూ, "ఈ వారంరోజులు వుండకూడదేమిటి?" అంది విసురుగా.

"ఇదిగో చూశావా మా నాన్న వుత్తరం. 'ఏవో పనులు' అని వ్రాశాడు. సెలవులవగానే వచ్చేస్తాగా. మరొక సంవత్సరం నీతోనే ఇక్కడ వుంటాను. ఏం రమా! సరేనా?" అని బ్రతిమాలుకొన్నాను. రమకు వుత్తరాలు వ్రాసేట్టు ప్రమాణ

చేసి, తను ఆమెను సంతోషపెట్టి, రైలెక్కి వచ్చే శాను ఆ సంవత్సరం.

♦ ♦ ♦

సెలవుల్లో రమ మూడు ఉత్తరాలు వ్రాసింది. ఎందుచేతనో మూడు మాసాలు నాకు మూడు యుగాలుగా గడిచినట్లనిపించింది. జూన్ నెల మొదట్లోనే గుంటూరుకు ప్రయాణం కట్టాను. 'రమ అందం' సెలవుల్లో ఇనుమడించినట్లు తోచింది నాకు. ఆమెలో మరొక క్రొత్త ఆకర్షణ కనిపిస్తుంది.

ఒకనాడు సాయంత్రం నేనే వెళ్లి "రమాదేవి గారూ, నాతో మాట్లాడటం చాలించారు, ఎందుకు?" అని ప్రశ్నించాను.

"సీనియర్లతో కూడా హాయిగా మాటల్తో కాలం గడపాలనుకున్నారా దొరగారూ" అందామె వ్యంగ్యంగా.

నా చదువుకు డిస్టర్బెన్సు చెయ్యకూడదని ఆమె భావం. ఐతే, రమతో మాట్లాడకుండా నేను చదువ గలనా? ఏదో ఒక నెపంతో రమ యింట్లోకి వెళ్లి మాటల్లో దించేవాణ్ని. అప్పటికీ రమ గ్రహించి "దొరగారు యిక వెళ్లొచ్చు" అని ఖండితంగా చెప్పేది. ఆ ఆజ్ఞలో నామీద రమకున్న చొరవ తెలిసిపొయ్యేది. నేను మరింకేమి కిక్కురుమనకుండా రూముకు వచ్చేసేవాడ్ని.

రమ నామీద ఈ సంవత్సరం మొదట్నుంచి ఒక విధమైన అధికారం చెలాయించడం చూసి నాకు అత్యానందం కలిగేది. ఆమధ్య ఫ్రెండ్సు బలవంతంతో సిగరెట్టు పీల్చిరాగా వాసన పసికట్టి 'ఇలాగైతే మీతో మాట్లాడను' అని రమ గట్టిగా చెప్పింది. వచ్చే సినిమాకల్లా వెళ్తూవుండటం, ప్రతి రోజూ రమదగ్గర అలాంటి చివాట్లు తినడమంటే చాల యిష్టంగా వుండేది నాకు. కాని అందులో నాకేదో అవ్యక్తానుభూతి కలిగేది.

కాలపరివర్తనతో బాటు నాలో అనేక కోర్కెలు తలఎత్తాయి. 'రమ'ను నాకళ్లు వెయ్యి దృష్టులతో పరిశీలించడం అలవాటు చేసుకొన్నాయి. నాకు ఇప్పుడు క్రొత్త సమస్యలన్నీ ఉద్భవించాయి. నాలోని ఆవేదన రమకు తెలియజెయ్యాలని తహతహ జాస్తి కాజొచ్చింది.

ఒకనాడు మాటల మధ్యలో "నీ చెక్కిళ్లు బాలు రమా!' అన్నాను. ఆమెకు కోపం వచ్చింది. "ఛీ ఛీ" అంటూ ఆమె అక్కడ్నుంచి లేచి వెళ్లిపోయింది. నేను కొయ్యబారిపోయాను. రమ ముఖంలో అంతకోపం చూడటం అదే మొదటి సారి. నా శరీరం కంపించిపోతూంది. రమ ఇక జన్మలో నాతో మాట్లాడదేమోనని భయపడి పోయాను. అనుకున్నట్లుగా రమ నాలుగైదు రోజులు నా రూమువైపుకే తిరిగి చూళ్లేదు. నాకు అనుమానం దృఢమైంది. రమను క్షమాపణ కోరుకొందామను కొన్నాను. ఒకనాడు కాలేజినుంచి వస్తూనే రమ యింట్లోకి వెళ్లాను. అప్పుడే స్నానంచేసి వచ్చిందేమో అద్దంముందు చేరి తల దువ్వుకుంటూ వుంది. ఇంట్లో ఎవరున్నట్లు లేదు. నేను వెనుకగా వెళ్లి నిల్చున్నాను. అర్ధనగ్నంగా వున్న ఆమె వేషాన్ని చూసి నాలో విషయశక్తులు ప్రకోపించాయి. వచ్చిన విషయాన్ని మర్చిపోయి ఉన్మత్తుడినవుతూ, "రమా" అంటూ వెళ్లి ఆమె భుజాలపైన చేతులు వేశాను. అదిరిపడ్డ లేడిలా ఛెంగునలేచి పైట సర్దుకుంది రమాదేవి. నా చేతుల్త్రోసి అవతలకు వెళ్లాలని ప్రయత్నించింది. అంతలోనే ఆమెను నావైపుకు లాక్కుని చెక్కిలి గట్టిగా స్పృశించాను. నా చేతులు విడిపించుకుని దూరంగా వెళ్లింది రమ. "ఛీ. ఇవేం పాడుబుద్ధులు, వెళ్లండి ఇక్కడ్నుంచి" అని గట్టిగా అరిచింది.

నేనలా చెయ్యాలనుకుని రాలేదు, అంతా ఆవేశంలో అప్రయత్నంగా జరిగిపోయిందని చెబుదామనుకొన్నాను. కాని, రమలో రౌద్రాకారం చూసి మాట్లాడకుండా వచ్చేశాను.

రమమీద నాకు అపరిమితమైన జాలివేసింది. నన్నెంతో ఆదరంగా చూసుంది రమ. అలాంటి రమనేనా నేను అవమానించేదీ — నాలో వూహాలు పలువిధాలుగా పొయ్యాయి. ఇంక రమ ముఖం చూడలేను. రూమ్ మార్చేద్దామని కూడా నిశ్చయించాను.

రమ మాత్రం మాటలు చాలించి రెండువారాలు గడిచాయి.

ఒక పండుగరోజున రత్తమ్మ రమచేత నాకు గారెలు పంపించింది. పళ్లెం తెచ్చి నా టేబిల్ మీద పెట్టి వెళ్లబోయింది. "రమా!" అని పిల్చాను. ఆగింది. కాని, ఆ వైపుకు ముఖం పెట్టింది. రమ దగ్గరగా వెళ్లి, "నామీద కోపం వచ్చిందా?" అన్నాను ఆమె కళ్లలోకి చూస్తూ.

దూరంగా జరిగి "మీ మనసు మార్చుకున్నారా?" అని అడిగింది. నేనేమీ మాట్లాడలేదు. రమ మెల్లగా వెళ్ళిపోయింది.

రమ బెంకితనం మానినకొద్దీ నాలో పట్టుదల కూడా హెచ్చింది. ఒకనాడు ఒంటిగంట వేళ హఠాత్తుగా మెలకువ వచ్చింది. తిన్నగా రమ పడక దగ్గరికి నడక సాగించాను. మేడమీద రమ ఒక్కర్తే పడుకొని నిద్రపోతూ వుంది. లైటు ఆర్పడంకూడా మర్చిపోయింది. లైటు ఆర్పి నేను మెల్లగా రమ మంచం దగ్గరగా వెళ్ళాను. మత్తుతో తూలిపోతూ ఆమె పెదాలను స్పృశించాను. ఆమె కదిలింది. నేను ఆమెను వదలకపోవడం చూచి కలవరపడి అరవబోయింది. నోరుమూసి, "నేను రమా...ప్రసాద్‌ను" అన్నా. రమ నాగొంతువిని లేచి లైట్ వేసింది.

"ఎందుకొచ్చారు!" అని గద్దించింది.

"పెద్దగా అరవకు రమా. మీ అత్త వింటుంది."

"వెళ్ళిపోండి. లేకపోతే నేనిప్పుడే మేడదూకి చస్తాను" అని బెదిరించింది.

"నీతో చావడానికి నేనూ సిద్ధమే రమా. నన్నెందుకు వేధిస్తావు...నిజం చెప్పు. నామీద నీకు యిష్టం లేదా?"

రమ వణికిపోతూ వుంది. "వెళ్ళండి. మీకు పుణ్యం వుంటుంది" అని బ్రతిమాల్తూ అడిగింది: "ప్రసాద్ నన్ను గౌరవంగా బ్రతకనీయరా; నన్ను నాశనంచేస్తే మీకు సంతోషమా?" అని ఏడ్చింది.

"రమా...ఆ మాటనకు రమా! ఆ మాటనకు. ఈ క్షణంకోసం కాదు. నిన్ను శాశ్వతంగా నాదాన్ని చేసుకుంటాను. మనిద్దరం పెళ్ళి చేసుకొందాం" అన్నాడు.

"అసంభవం. మన కులాలు, సంప్రదాయాలు వేరు ప్రసాద్. నామాట విను. వృథా ఆశలు పెట్టకు. నన్ను నలుగుర్లో తలెత్తనీకుండా చెయ్యకు" అని బ్రతిమాలింది.

రమకున్న భయాన్ని, పిరికితనాన్ని పోగొట్టేసరికి నాకు దేవుడు కన్పించాడు. ఆరోజు రమకు నాకు జరిగిన వాగ్వివాదం ఈనాటికి నా చెవుల్లో మారుమ్రోగుతూనే వుంటుంది.

నేను యూనివర్శిటీ పరీక్షలు వ్రాస్తున్న కనుయంలో ఒక మంచి సంబంధం వచ్చింది. బి.యస్‌సి. చదివాడు. పరంధామయ్య అతనిని చేసుకోమని రమను పట్టుబట్టాడు. రత్నమ్మగారు కూడా ఆ సంబంధం వైపుకే మొగ్గు చూపింది. రమను కాపాడ్డానికి ఒక్కటే నాకు శరణ్యంగా తోచింది. పరీక్షలై పోయాయి. ఉత్తరదేశం ఎక్స్‌కర్షన్ వెళ్తున్నామని ఇంటినుంచి నాలుగు వందలు తెప్పించాను.

ఒకనాడు వేకువఝామున రమతో నేను నెల్లూరుకు రైలెక్కాను. నా జీవితంలో యిది ఒక నూతన సాహసం! ఒక నూతన అధ్యాయం ఆరంభమైంది.

నెల్లూర్లో యిల్లు అద్దెకు తీసుకుని క్రొత్తజీవితాన్ని ప్రారంభించాం. కాని, మా జీవితంలో వడిదుడుకులు యింకా తగ్గలేదు. మావాళ్ళు నా విషయం తెలిసి నన్ను వెదకటం మొదలుపెట్టారు. ఒకసారి హఠాత్తుగా ఒకచోట మా నాన్నగారు నలుగురు పెద్దలతో బజారులో నాకు కనిపించారు. నేను చేసిన పనికి నాన్న చాల బాధపడ్డాడు. రమను వదిలెయ్యమని, వేరే మంచి సంబంధం తెస్తానని చెప్పాడు. లాభం లేదన్నాను. నాన్నకు కోపంవచ్చి నానా మాటలన్నాడు. చివరి అస్త్రంగా "పోనీ, నీ బ్రతుకేలాగో తగలడనీ - నీకోసం మీ అమ్మ ప్రాణాలు పోయేట్టున్నాయి. ఒక్కసారి చూచైనా రావూ?" అన్నాడు. దాంతో నేను కొంచెం మెత్తబడ్డాను. అమ్మ కోర్కెను ఏనాడు తృణీకరించలేదు. సరే నన్నాను. అమ్మనుచూసి వచ్చేద్దువుగాని అన్న మీదట నేను ఒప్పుకొని, యింటికెళ్ళి రమతో ఈ విషయం చెప్పాను. రమ కొంచెం తటపటాయించింది. "మళ్ళీ వస్తారా?" అనునయంగా అడిగింది. ఆమెకు నమ్మకం కలిగేట్టు చెప్పి, మూడు రోజుల్లో వస్తానని ప్రయాణం చేశాను.

ఊరుకి వచ్చి చూశాను. నిజంగా అమ్మ నా కోసం బాగా చిక్కిపోయి వుంది. ఊళ్ళో కొందరు నన్ను వింతమృగాన్ని చూసినట్లు చూడసాగారు. అనుకున్న ప్రకారం అమ్మతో చెప్పి మూడోరోజు ప్రయాణమయ్యాను. అమ్మ ఏడ్వటం మొదలెట్టింది. ఆ ఏడుపు నన్నూ రమనూ దూరం చేసేందుకు కారణమైంది. ఊరి పెద్దలు కొందరు నాకు హితబోధ చెయ్యడం మొదలుపెట్టారు. నా మనసు సందిగ్ధంలో పడిపోయింది. "నీతో లేచివచ్చిన పిల్ల మహాకరిత్తో పోదని నమ్మకమేమిటి?" అని ప్రశ్నించారు. నలు

గురూ అలా అనడంతో నేను కొంచెం మెత్తబడ్డాను. అంతే. నన్ను ఆ వాతావరణం పూర్తిగా మార్చి వేసింది, రమకు ఉత్తరం వ్రాశాను.

"విధి బలవత్తరమైంది. నన్ను క్షమించు రమా! మా అమ్మ ప్రాణాలు తియ్యలేను. నన్ను మర్చిపోవటానికి యత్నించు. నీ జీవితం పాడైందని అనుకోకు. ఏ క్షణాన నీకు నా సహాయం కావాలో సిద్ధంగా వుంటాను. నీ ఆదరణను నేనెన్నటికీ మర్చిపోలేను రమా. నీకోసం వెయ్యి రూపాయలు పంపుతున్నాను" అని వ్రాశాను. కాని డబ్బు నాకు తిరిగి వచ్చింది. రమ తీసుకోలేదు.

"ఆమె ఎక్కడికి వెళ్ళిందో, ఏం చేస్తుందో, నాకేమాత్రం ఆమె జాడలు తెలియవు. నేనెంత రాక్షసుడినో యిప్పుడు అర్థమైందా ప్రభా!" అని నేను ప్రభవైపు చూశాను. ఆమె కళ్ళలో నీరు కారుతూ వున్నాయి.

కాసేపాగి, "మీరు సర్వనాశనం చేసింది నా స్నేహితురాలినే" అన్నది బాధగా ప్రభ.

"ఆఁ!...ఎవరు? నీ స్నేహితురాలా?"

"కాకినాడలో నాతో ఫోర్తుఫారం చదువుకుంది. తర్వాత వాళ్ళ అమ్మ నాన్న గతించారు. మామయ్యగారి వూరు గుంటూరుకి వెళ్ళిపోయింది. తన జీవితాన్ని గూర్చి ఎన్నో వుత్తరాలు వ్రాసింది."

"అయితే రమ యిప్పుడెక్కడుంది?" ఆతురతగా అడిగాడు.

ప్రభ రెప్పల్లోనుంచి రెండు కన్నీటి ముత్యాలు వేడిగా జారాయి. ఆమె మౌనంగా కాసేపు వుండిపోయింది. మా నాన్ని భరించలేక బ్రతిమాలుకున్నాడు. "ఎక్కడుందో త్వరగా చెప్పవా, ప్రభా?"

తన భర్త కళ్ళలోకి చూస్తూ "జనరల్ హాస్పిటల్లో వుంది. ఉదయం వెళ్ళొచ్చాం దక్కడికే. అంతిమదశలో వుంది. డాక్టరు ఫర్వాలేదంటున్నాడు" అంది ప్రభ.

లేగిన జుత్తులోనే లేచాడు. వెఱ్ఱిగా గుమ్మంవైపుకు నడిచాడు. భర్తనుచూసి ప్రభ అదిరిపోయి ధైర్యం చిక్కబట్టుకుని భర్తనంటి నడిచింది. బండికోసం చూచాడు.

జట్కా వార్డుముందు ఆగింది. లోపలికి దారితీసింది ప్రభ. మెట్లవైపు నడిచి అక్కడ్నుంచి ప్రక్కవైపుగానున్న సందుగుండా లోపలికి వెళ్ళింది. ప్రసాదు వణుకుతున్న కాళ్ళతో వెంబడించాడు.

రమ తను రావల్సిన గది తప్పిపోయి వచ్చిందేమో నని భయపడింది. చూడవలసిన రూపానికి బదులు మరొకరూపం ఆ మంచంలో కన్పించింది. వృద్ధురాలు దగ్గరికొచ్చి, "ఇంకెందుకమ్మా, ఏడిస్తే వస్తుందా నాయనా. ఇదిగో, ఈ చీటీ నీ కిమ్మంది తల్లీ" అని ఓదార్పు చెప్పింది. ప్రభ వుత్తరం చదువుకుంది.

"ప్రభా - ఇదే నా చివరి వుత్తరం. నా జీవితం ఇలాగే అంతమై పోనీ. అక్కకన్నా ఎక్కువగా చూశావ్. నా పతనానికి కారకురాల్ని నేనే. తప్పంతా నాదే _ మీ శిశువుకు నా పేరు పెట్టావు కదూ _ ఈ బీదరాలిని తల్చుకొంటూ వుండు _ వెళ్తున్నా చెల్లీ" అని చదువుకుని "అక్కా" అంటూ చేతుల్లో ముఖం దాచుకుని ఏడ్చింది ప్రభ.

ఆ వార్డంతా ఈ దృశ్యం చూస్తున్నారు. ప్రసాద్‌కు తన కాళ్ళక్రింద భూమి బ్రద్దలై కంపించినట్లయింది. స్వయంగా ఆలోచించే స్థితి తప్పింది సవ్వడి గుర్తించి కళ్ళు తెరిచింది ప్రభ. పిచ్చిగా తల బాదుకుంటూ తూలిపోతున్న భర్తను చూసి వణికిపోయింది. ఏడ్పు నిలద్రొక్కుకుని వెళ్ళి పట్టుకుంది. క్షణంపాటు యిక్కడుంటే భర్తకు ప్రమాదం కలుగవచ్చని మెల్లగా తీసుకెళ్ళి జట్కా ఎక్కించింది.

వాళ్ళ కళ్ళతడిలోనే ఆసుపత్రి దూరమైపోయింది



# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోయిన్ డె సయింట్-ఎక్సుపెరీ

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ



ఇంతవరకు సాగిన కథా భాగం

("రాజకుమార్" కథను మనకు చెబుతూవున్నాయన రాజకుమార్‌ని నూతి దగ్గరకు తీసుకునివచ్చి మంచి నీళ్లను తోడి ఇచ్చి వాడి దప్పిని తీర్చాడు, దాంతో అబ్బాయి తేమలు కున్నాడు. తనకు నచ్చిన బొమ్మలను గీచి ఇయ్యమని ఆయన్ని తన ధోరణిలో మారాం చేశాడు. అదృష్టవశాత్తు ఆ సమయాన ఆయన దగ్గర ఇలాంటి పనులకు పనికివచ్చే సామాన్లు వున్నాయి. వాటిని బయటికితీసి అబ్బాయి కోరిన బొమ్మలను గీచి ఇచ్చాడు. ఇక కథ ఎలా సాగుతుందో చూడండి)

I

ఆ బొమ్మ కాగితాలని ఒక మూలకి త్రోసివేసి మరో చిత్రంకేసి తదేకంగా చూస్తూ "ఇది నిజంగా నక్కఅని అన వచ్చా? ఆ చెవులకేసి ఒక సారి చూడు... కొమ్ములకు మల్లె కనబడటంలేదూ? ... అంత పెద్దవిగా వుంటాయని ఎలా అనుకున్నావు?" అని అంటూ చప్పట్లుకొట్ట సాగాడు రాజకుమార్.

దాంతో నాకు చిరుకోపం వచ్చింది. "ఇదిగో అబ్బాయి! నువ్వు అలా నా బొమ్మలని విమర్శించటం ఏమాత్రం బాగా లేదు. అవి నా కళ్ళకి అలా అగపడ్డాయి. అలా గీయకుండా మరేం చెయ్యమంటావు? ..."అని కటువుగా అనాలసివచ్చింది.

నా యీ జవాబుకు అబ్బాయి ఏమనుకున్నాడో, పాపం! "నీకు అన్నీ అలాగే కనబడుతూవుంటాయి. కాని కుర్రవాళ్లకి ఆ రహస్యం తెలుసు. అంచేతనే వున్న సంగతి తటపటాయించక చెప్పటం వాళ్లకి ఇష్టం." అని నవ్వుతూ అన్నాడు.

నేను గీసిన చిక్కం వాడికి నచ్చకపోతే మరో దానిని గీయాలని నోటు పుస్తకాన్ని తీసి దానో చిక్కం ఎలా వుంటే వాడికి బాగా నచ్చుతుందో కొంచెం ఆలోచించి గీశాను...

ఆ పని పూర్తి చేయటంతో వాడు దానితో తృప్తి పడతాడని ఎంతో ఆశ పడుతూ వాడి చేతికిచ్చాను. వాడి మనస్సు ఆ క్షణంలో అక్కడ వుంటేగా దానిని చూసి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చటానికి?......

నలు వైపులా కలయచూస్తూ "ఈ లోకంలోకి ఎప్పుడు అడుగు బెట్టానో తెలుసా? ... రేపు ప్రొద్దుటికి సంవత్సర మవుతుంది! ..." అని అంటూ చటుక్కున ఆగిపోయాడు. కొంచెం సేపు మౌన దీక్ష. తరువాత వాడి బుర్రలో ఏం మెరిసిందో "నేను ఇక్కడ దిగటం నీకు సమీపంలోనే..." అని అన్నాడు. ఆమాటతో వాడి మొహం వెలవెల వాడిపోతున్నది. అబ్బాయిలో ఇలా మార్పు కలగటం చూస్తూ ఆశ్చర్యపోతున్నాను. వాడికి స్వభావసిద్ధమైన మందహాసం మాయమై

పోయింది. ఏవేవో కష్టాలని ఎదుర్కొంటూ వాటినుంచి బయటపడలేక క్రుంగి కృశించి పోతున్న మనిషికిమల్లె వాడి వాలకము మారిపోతూవుండటం చూస్తూ కంగారుపడి పోతున్నాను. వాడి భుజాన్ని తడుముతూ "ఎందుకలా కంగారు పడటం" అని అబ్బాయిని అడిగాను.

ఒళ్లు వణికి పోతున్నది అబ్బాయికి. ఏదో చెప్పాలని వాడి తాపత్రయం, కాని పెదవి కదిలితేగా వాడి ఆ కంగారులో!

"ఎందుకబ్బాయి అలా కంగారు పడటం? ఇంతకు ఈ కంగారు కంతా కారణమేమిటో చెప్పవూ?" అని అబ్బాయిని బుజ్జగిస్తూ అడిగాను.

దాంతో అబ్బాయి కొంతవరకు కుదటపడ్డాడనే అనవచ్చు.

"అదంతా ఇప్పుడుకాదు. నువ్వు చూసుకోవాలసిన పని బోలెడు వుంది. తిన్నగా ఇంజను వున్న చోటికి వెళ్లిపోయి ఆ పని పాటలని చూసుకోటం మంచిది. నేను ఇక్కడే వుండిపోతాను. నువ్వు రేపు సాయంకాలం ఇక్కడికివచ్చావా..."! అని నిట్టూర్పు విడుస్తూ అన్నాడు.

అబ్బాయి నాకు ఇలా సలహా ఇయ్యటం ఎందుకా అని విస్తుపొయ్యాను. వాడు తన ప్రయాణానికి సంబంధించిన కథలని గాథలని ఎన్నిటినో చెప్పాడు వాడు నాదగ్గిర వుండిపోయిన ఈ వారంరోజుల్లో. మనవంటి వాళ్లకి ఇవన్ని వింతగా తోచవచ్చు. కాని అవి వాడికి ఏమాత్రం వింతగా కనబడటంలేదు ... కాని అబ్బాయి ఎందుకలా కంగారు పడటం? రేపటికి వాడు ఈ లోకంలో అడుగుబెట్టి సంవత్సర మవుతుందని అన్నాను. ఆ మాటతో వాడి మొహం వెలవెల బారి పోయింది ... ... అంటే ఈ సంవత్సర కాలంలో వాడిని అలా కలవర పెట్టే సంఘటనలని ఎదుర్కొని వుండాలి! ... అవి ఏవైవుంటాయో? ... అక్కడా ఇక్కడా తను ఎదుర్కొన్న సంఘటనలని చెప్పుతూ నక్కతో తనకి ఎలా పరిచయమైందో పేర్కొన్నాడు...ఆ సందర్భంలో నక్క అబ్బాయికి ఇచ్చిన సలహా ఎలా మరచి పోగలుగుతాను? అడవి జంతువులు ఎన్నో వుంటాయి. వాటి ప్రమాదంనుంచి తప్పుకోవాలంటే నయాన భయాన వాటిని మచ్చిక చేసుకున్నామా అలాటి జంతువులు మన అడుపాజ్ఞల్లో వుంటాయి ... తరువాత! ఆ సంగతేగా మనం ఆలోచించాలసింది! అబ్బాయి రేపు సాయంకాలం తనని కలుసుకోటానికి ఇక్కడికే రమ్మన్నాడు నన్ను! అప్పటికి అబ్బాయి ఈలోకానికి వచ్చి సంవత్సరము అవుతుంది ... వాడిని కలుసుకున్నప్పుడు ఏం 'వాడు' చెప్పాలనుకున్నాడో?

II

నూతికి కొంచెం సమీపంలోనే ఒక మేడవుంది. ప్రస్తుతము ఇల్లంతా శిథిలమై పోయింది... అబ్బాయికి ఇచ్చిన మాట ప్రకారము మరుసటి రోజు సాయంకాలానికి, నా పని పాటలన్నిటినీ ఆరోజుకుపూర్తి చేసుకుని అక్కడికి చేరుకున్నాను. అబ్బాయి

ఇంటి ప్రహారీగోడమీద కూర్చుని ఎవళ్ల తోనో మాట్లాడుతూ వున్నట్లు దూరా న్నుంచే తెలుసుకోటం అంత కష్టమైన పని కాదు.

"నువ్వు అంతా మరచిపోయినట్లు కన బడుతూవుందే!...మనం అప్పుడు కలుసు కున్నది ఇక్కడే అని ఎందుకలా అంటావు?" .. "అని అబ్బాయి అంటున్నాడు.

మరోకంఠం వాడికి ఏదోదానిపంథాలో అంటూవున్నది. దానికి వాడు వుక్కిరి బిక్కిరయిపోతూ బిగ్గరగా ఇలా అంటూ న్నాడు?

ఆ! ఆ! ఆ సంగతి నిజమే! అదు కాలా నిజమే! ఆరోజు సంగతి నాకుబాగా జ్ఞాపకంగానేవుంది. కానీ అప్పుడు మనం ఎక్కడ కలుసుకున్నామో .... అది ఇదే అని నువ్వు అంత నిక్కచ్చిగాచెప్పటం..." అని అంటూ తడబడి పోతూవున్నాడు. ఆ సమయానికే ఆ ప్రహారీ గోడ దగ్గరికి చేరుకుంటున్నాను. అక్కడ అబ్బాయి తప్ప మరెవళ్లూ కనబడలేదు. కాని అబ్బాయి వాడి ధోరణిలోనే మాట్లాడుతూ వున్నాను.

అబ్బాయిని సమాధాన పరచటానికి ఆ కంఠం ఏమో చెప్పివుండాలి. దానికివాడు ఆదుర్దాలో తలనూవుతూ

"ఆ! ఆ సంగతి ఇప్పుడు జ్ఞాపకం వస్తున్నది. ఆరోజున ఈ ఇసుకలో నేను ఎక్కడ కాలు పెట్టిందీ నీకు బాగా తెలుసు. నువ్వు ఇప్పుడు అక్కడే నాకోసము ఎదురు చూస్తూవుండటం మంచిదనుకుంటాను. ఇప్పుడు నేను చూసుకోవాలసిన పని కోతె డంతవుంది. దాన్నంతా చూసుకుని అర్ధ రాత్రి వేళకు అక్కడికి వచ్చి నిన్ను తప్పక కలుసుకుంటాను. ... "అని అబ్బాయి ప్రశాంతంగా అంటున్నాడు.

తిన్నగా అబ్బాయి దగ్గరకు చేరు కున్నాను. నలుప్రక్కలా కలయచూశాను వాడు ఎవళ్లతో అలా మాట్లాడు తూ వున్నాడో తెలుసుకోవాలనే అతృతతో దగ్గరికి వచ్చినా వాడు నాకేసి చూస్తేగా! ఆ కంఠం ఏదోఅని వుండాలి. దానికి తగిన జవాబు ఇయ్యాలనే కోరికతో కాబోలు కొంచెంసేపు ఏదో ఆలోచిస్తూవున్నాడు.

.......

"నీ విషయంసామాన్యమైనది కాదన్న సంగతి నాకూ బాగా తెలుసు! దాంతో నేను చాలా సేపు బాధ పడటం నీకు ఇష్టం లేదన్నసంగతి కూడా నాకుబాగా తెలుసు ..."అని గట్టిగా నిట్టూర్పు విడుస్తూ దాంతో అబ్బాయి అంటున్నాడు.

వాడి యీ మాటలను అప్పుడు వాడిలో కెరేత్తుతూ వుండే వుద్రేకాన్ని చూస్తూ హడలిపోక మరేం చేయగలుగుతాను?

"ఇక నువ్వు తిన్నగా వెళ్లవచ్చు అర్ధ రాత్రి వేళకు తప్పక నువ్వువుండే చోటుకి వచ్చేస్తాగా! .."అని క్రింది కేసి చూస్తూ అంటున్నాడు.

(సశేషము)




# సాహసవీరులు

### శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు

(గతసంచిక తరువాయి)

అనుకోకుండా ఇద్దరూ ఒకేదారిలో కలుసుకున్నారు. ఇంతత్వరలోనే శివబంటును కలుసుకున్నందుకు ఆశ్చర్యపోకపోయినా, శివబంటు ప్రక్కనున్న పిల్లనుచూచి ఆశ్చర్యపోయాడు హరకుమార్.

హరకుమార్ శివబంటూ రాజమహలు చేరుకున్నారు. కాని వారక్కడికి చేరుకోగానే "పాయిసం" ముందుకూర్చుని రాజూరాణీ ఏడుస్తున్నారు. హరకుమార్ రాగానే వారు ఎంతో ఆనందంతో బంగారు చామంతిని అందుకుని రాకుమారికి వాసన చూపించారు. రాకుమారి నిద్రపోయి లేచినట్లుగా లేచికూర్చుంది. "వింతగావుందా! హరకుమార్ నాకూతురుకు యిరువదవ ఏటన గండమున్నదని చెప్పారు. కాని ఆగండం తప్పిపోవటానికి బంగారు చామంతిని వాసనచూపితే తిరిగి బ్రతుకుందని ఓ జ్యోతిష్కుడు చెప్పినందువల్లనే యీపరతుపెట్టవలసివచ్చింది. నాకుమార్తెను రక్షించిన నీవే దానికి పతివి" అని వైభవోపేతంగా "పాయిసం"నిచ్చి హరకుమార్‌తో వివాహంచేశాడు.

శివబంటు వెంటవచ్చిన "మిఠాయి పొట్లం"ను మానీ కాంచనం ఎడమోహం పెట్టినా, నాలుగు రోజుల తర్వాత ఆమెలోంచి తన్నుగుర్తించి తన సోదరిగా ఎంచి గౌరవించసాగింది. శివబంటుకు ఇంతకన్నా కావలసిందేముంది?

8

ఆరోజు హరకుమార్ ప్రొద్దెక్కి లేచాడు. కండ్లు నలుపుకుంటూ బయటకువచ్చాడు, మహారాజు దగ్గర జనం గుమికూడివున్నారు. మహారాజేమో వారికి సర్ది చెపుతున్నారు. హరకుమార్ దగ్గరగా వచ్చి 'ఏమిటది' అని అడిగాడు.

ప్రజలు చేతులు జూపించుతూ "ఏం చెప్పం బాబూ! మా అవస్థ ఆ పరమాత్మునికెరుక! అర్ధరాత్రి అయ్యేసరికి పెద్దపులి ఒకటి నగరంలోకి జొరబడి కనబడిన పశువునెల్లా ఎత్తుకపోతుంది. నిన్న ఒకమనిషికూడా గల్లంతయ్యాడు. మీరు ఈ విషయంలో శ్రద్ధతీసుకోకపోతే ఇహబ్రతకలేం బాబూ!" అని మొరపెట్టుకున్నారు.

హరకుమార్ ప్రజలకు ధైర్యంచెప్పి పంపాడు. కాలకృత్యాలు దీర్చుకొని పులివేటకు బయలుదేరాడు. ఇంక శివబంటు గబగబా పరుగెత్తుకుంటూ వచ్చి 'నేను మీ వెంటే' అన్నాడు. "పద వెళదాం" అని వూరి బయటకెళ్ళి పొంచివున్నారు. పగలల్లా దాని ఆచూకిలేదు. రాత్రి నగరమంతా మాటుమణిగిం తర్వాతా పులి గాండ్రింపులు వినిపించినై.

"శివబంటు పులి అరుపులు శ్మశానపుప్రాంతం వైపు నుంచికదూ! 'అక్కడికెళదామా!"

"అయ్యబాబోయ్! నేను రాను ఈ అర్ధరాత్రి స్మశానాలదగ్గరకు — అని చెట్టెక్కికూర్చున్నాడు." "భలేధైర్యవంతుడివే. నీవలా చెట్టుమిద నేవుండు నేను పులిని సఫాచేస్తా" నంటు పొంచికూర్చున్నాడు.

ఇంతలో పులి చెంగుచెంగుమని వచ్చి హారకుమార్‌ను నోటకరుచుకొని పరుగుతీసింది. శివబంటు లబోదిబో మంటూ గడగడా వణుకుతూ తెల్లారు చెట్టుమీద జాగారం చేశాడు. తెలతెలవారుతుండగా నగరంలోకి వచ్చి ఏడుస్తూ జరిగిన సంగతంతా చెప్పాడు. ఇంకే ముంది! రాజనగరు అంతా ఏడుపు పెడబొబ్బలతో నిండిపోయింది. క్రొత్తగా పెండ్లయిన తనకూతురికి అప్పుడే వైధవ్యం ప్రాప్తించటంచూసి రాజు, రాణీ గగ్గోలు మన్నారు. ఇక పాయిసం దుఃఖానికి అంతే లేదు. హారకుమార్ చిత్రపటాల్ని తీసుకుని అగ్ని ప్రవేశానికి బయలుదేరింది. బ్రహ్మాండంగా ఆకాశాన్నంటుతున్న అగ్ని జ్వాలలదాపుకువచ్చింది పాయిసం. మహారాణి మహారాజూ గగ్గోలు చెప్ప తరంకాదు. శివబంటు కన్నీళ్ళతో నించున్నాడు.

(సశేషము)





పెనాయ్‌నగర్ సాయినిలయమందు
శ్రీరామనవమి ఉత్సవంలో పాల్గొనిన భక్తకోటిలో నొక భాగము

ఓం

# ప్రకటన

విశ్వ విఖ్యాత శ్రీ 'అవతార్' శివానంద భగవానుల (శివానందనగరము, హృషీకేశము, డెహరాడూన్ జిల్లా, హిమాలయములు) ఆంగ్లమున గల ఆధ్యాత్మిక గ్రంధములు తెలుగున తర్జుమా యొనర్పబడి ప్రచురితమై విక్రయమునకు సిద్ధముగ గలవు. ఈ దిగువ తీరున తగ్గింపుధరలకు 30-6-60 వరకు మాత్రమే యీయబడును. ఆర్డరు చేయుముందు విధిగ యడ్వాన్సు పంపవలెను. అడ్వాన్సు పోను మిగిలిన సొమ్ముకు వి. పి. గ పుస్తకములు పంపబడును. ఇంకను కొలది ప్రతులు మాత్రమే గలవు. త్వరపడుడు.

పోష్టుఖర్చులు అదనము

1. భగవద్గీతా భాష్యము 10-0-0 8-0-0
2. దివ్యజీవనము 3-0-0 1-8-0
3. నారదభక్తి సూత్రములు 2-0-0 1-0-0
4. సర్వగీతార్థసారము 2-0-0 1-0-0

యోగజీవనప్రకాశిక

Sure Ways of Success in Life And God Realisation

5. ,, ప్రధమ భాగము 2-8-0 1-4-0
6. రెండవ భాగము 2-4-0 1-2-0
7. కోపము–దానిని తగ్గించుకొనుట (ద్వితీయ ముద్రణ) 0-8-0 0-6-0

పై ఏడు గ్రంధములు శివానందులవారివి

8. ప్రశ్నోత్తర భగవద్గీతాసారము 1-8-0 1-0-0
9. త్రిపురరహస్యము అనే ఆత్మవిద్య 2-8-0 1-8-0

తొమ్మిది గ్రంధము లొక్కసారి కొనువారికి తగ్గింపు ధరలతోపాటు పోష్టుఖర్చు లుచితము.

త్వరలో ముద్రణ కానున్న శివానంద గ్రంధములు

(1) భక్తిసంకీర్తన, (2) సమన్వయయోగము, (3) ఆధ్యాత్మిక నాటకములు, (4) ఆత్మజ్ఞానము (5) ఆధ్యాత్మికానుభవములు, (6) మరణాంతరము జీవునకేమగును.

వలయువారు:-

నండూరి వెంకటసుబ్బారావు B. A., S. D. L. S.
దివ్యజీవన సంఘాధ్యక్షులు
దక్షిణపువీధి — ఏలూరు
పశ్చిమ గోదావరిజిల్లా

---



సాయినిలయమందు శ్రీ రామ నవమి ఉత్సవంలో స్వామి కేశవయ్యజీ, అధ్యక్షత వహించిన శ్రీ O. V. అలగేశన్‌ను పుష్పమాలాలంకృతుని చేసినప్పటి చిత్రం



## చిత్రసమీక్ష

### మహాకవి కాళిదాసు

యావదాంధ్రదేశంలో సారణీ ఫిలిమ్స్‌వారి 'మహాకవి కాళిదాసు' చిత్రం విడుదలయి ప్రజలను విశేషంగా నాకర్షించుచున్నది కథాగమనంలోను, సన్నివేశాల పొందికలోను మహాకవి చరిత్రను సహజంగా చిత్రించాలనే ప్రయత్నము కనిపించింది దర్శకులు శ్రీ కే కామేశ్వరరావు కృషి ఫలితంగా నీ చిత్రము ప్రజానురంజకంగాను, ఉత్తమ కళాఖండంగాను రూపొందింది. నిర్మాతలు శ్రీ కే. నాగమణి, పి సూరిబాబుగారలు ప్రథమ ప్రయత్నంలోనే ఉత్తమ చిత్రమును నిర్మించకలిగినందుకు అభినందనీయులు.

ప్రజల వాడుకలోనున్న కట్టుకథలను, కాళిదాసు జీవించిన స్వర్ణయుగంనాటి చరిత్రాధారాలను ఆధారంగా తీసికొని 'మహాకవి కాళిదాసు'కు కథావస్తువును రూపొందించిన కవి అభినందించ తగినవాడు సంభాషణలు, పాటలు సన్నివేశాలు చాల పొందికగాను, రసవంతంగాను అమరినవి పెండ్యాలవారి సంగీతం, గోఖలేగారి కళ చిత్రాన్ని తీర్చిదిద్దినవి

పామరుడుగా పుట్టి దేవీ అనుగ్రహంవలన జగద్విఖ్యాత కవిగా రూపొందిన కాళిదాసు భూమికను శ్రీ నాగేశ్వరరావు సమర్థంగాను, సహజంగాను నిర్వహించాడు శ్రీరంజని, రాజసులోచన, రంగారావు, రేలంగి, సి యస్ ఆర్, మొదలగు మున్నగు నటీనటులు పాత్రౌచిత్యాన్ని చక్కగా పోషించి ప్రశంసలకు పాత్రులైనారు.

ఈ చిత్రం నిర్మాతలకు ధనంతోబాటు కీర్తిప్రతిష్ఠలను సంపాయించిపెట్టునది కాబట్టి ముందుముందు అనేక ఉత్తమచిత్రాల నిర్మించెదరని ఆశిస్తున్నాము

### ధర్మమే జయం

వరలక్ష్మి పిక్చర్స్‌వారి 'ధర్మమేజయం' చిత్రం విడుదలయింది. ప్రజలకు విశాలభావాలను, అభ్యుదయ మార్గాలను, ఉత్తమ ఆదర్శలక్ష్యాలను ప్రబోధించు చిత్రమిది ఇందులో ఉన్నవాళ్లకు, లేనివాళ్లకు మనస్తత్వాలలోగల తారతమ్యంతోబాటు ఉత్తమ ఆదర్శవాదులయినా కొన్ని సమయాలలో సిరిసంపదల ప్రభావానికి, ఆడంబరానికి బీదలు ఎలాగ లోబడిపోతారో చక్కగా చిత్రించబడింది. కథాగమనం, సంభాషణలు బాగున్నవి సంగీతములో ప్రత్యేకత లేకపోయినా హాయిగా నున్నది.

ఇందులో ఉత్తమ ఆదర్శలక్ష్యాలకోసం తాపత్రయపడే పత్రికారచయిత జీవితంలో పడుతున్న బాధలు, కష్టాలు హృదయాలను ద్రవింపచేస్తవి. కన్నాంబ వదినెగా మాతృహృదయంతో మరది అభివృద్ధి నుద్దేశించి చేసినత్యాగం, పడిన కష్టాలు ఆదర్శనీయం. బీదవారిపట్ల ధనవంతుల మనస్తత్వాలు ఎలాగుండేది, దాని ఫలితాలు యీ చిత్రంలో ప్రధానాంశాలు

గుమ్మడి, కన్నాంబగారలు ప్రశంసనీయంగా నటించారు, జగ్గయ్య, జమున, గిరిజ పాత్రౌచిత్యాన్ని చక్కగా పోషించారు. రేలంగి, రమణారెడ్డిగారల హాస్యం ఉత్తమస్థాయిలో నడిచింది.

శ్రీ కే బి. నాగభూషణంగారి దర్శకత్వానికీ చిత్రమొక విజయచిహ్నం. విశేషప్రజాదరణను పొందగలదీచిత్రము

—పున్నయ్య

### వార్తలు

సారణీ పిక్చర్స్‌వారి 'మహాకవి కాళిదాసు' చిత్రం విడుదలయి కనకవర్షం కురిపిస్తున్నదని వార్తలు

♦ ♦ ♦

వైజయంతిమాల, దిలీప్‌కుమార్‌లు ప్రధానపాత్రలు నిర్వహిస్తున్న జెమినీవారి 'పైగామ్' (సందేశం) హిందీ మహత్తర, విప్లవాత్మక సాంఘిక చిత్రము. ఆంధ్రదేశంలో అతిత్వరగా విడుదల కాబోతున్నది.

ఇందులో వైజయంతిమాల తల్లి వసుంధరాదేవి తల్లి గానే నటిస్తున్నదట. ఇందులో అన్నిహంగులతో పాటు హాస్యంసయితము ఆకర్షణీయంగా నుండగలదు.

◆ ◆ ◆

శ్రీ సి. పుల్లయ్యగారి దర్శకత్వంలో భార్గవీ ఫిలింస్ వారి 'దేవాంతకుడు' చిత్రం విడుదలకు సిద్ధంగా నున్నది. ఇందులో కృష్ణకుమారి, యన్. టి. రామారావు, రఘురామయ్య, కాంతారావు గారలు నటించారు. బహుశ మే నెల మొదటి వారంలో విడుదల కావచ్చు.

◆ ◆ ◆

సుఖీభవవారి 'శబరి' చిత్రం పూర్తికావచ్చింది. దీనికి చిత్రపు నారాయణమూర్తిగారు దర్శకులు. పండరీబాయి, హరనాథ్, ఆర్. నాగేశ్వరరావు మున్నగు నటీనటులతో రూపొందింది చిత్రము. పాలగుమ్మి వారి రచన, పెండ్యాలవారి సంగీత దర్శకత్వం.

◆ ◆ ◆

శోభనాద్రిరావుగారి దర్శకత్వంలో నిర్మాణ మయిన 'జగన్నాటకం' చిత్రము 15వ తేదీన విడుదలయింది. ఇందులో అమరనాథ్, కృష్ణకుమారి, గిరిజ మున్నగువారు నటించారు.

◆ ◆ ◆

జగపతి పిక్చర్స్ వారి 'అన్నపూర్ణ' చిత్రం సయితము విడుదలకు సిద్ధంగా నున్నది.

◆ ◆ ◆

అశ్వరాజ్ వారి 'దీపావళి' చిత్రం మహత్తరంగా తయారగుచున్నది. రామారావు, సావిత్రి, యస్. వరలక్ష్మి, గుమ్మడి, రమణారెడ్డి, కాంతారావు మున్నగువారు నటిస్తున్నారు. దర్శకుడు రజనీకాంత్. మే నెలలో విడుదల కాగలదనుకొంటున్నారు.

## చిత్రసమీక్ష

### 'జగన్నాటకం'

పద్మశ్రీ ఫిలింస్ వారి 'జగన్నాటకం' చిత్రము పత్రికా ప్రతినిధులకు యీ నెల 13వ తేదీన విజయా స్టూడియోస్‌లో ప్రదర్శించబడింది. దర్శకులు శ్రీ శోభనాద్రిరావు. సంగీత దర్శకత్వము శ్రీ అశ్వద్ధామగారిది.

ఈ చిత్రపు కథావస్తువు పౌరాణికం. భగవద్భక్తిని ప్రోత్సహించుచూ నైతిక, ఆధ్యాత్మిక విలువలను నిరూపించునదిగా రూపొందినది. భక్తివిశ్వాసాలతో భగవంతుని నమ్ముకొన్నవారు జీవయాత్రలో అనేక కష్టాలకు, దుఃఖాలకు గురియైనా చిట్టచివరకు పరమాత్మ అనుగ్రహకటాక్షాలు లభ్యంకాగలవనే సత్యాన్ని నిరూపించింది చిత్రం. నాస్తికవాదం, నైతికపతనం ప్రబలుతున్న యీ రోజుల్లో యీ చిత్రపు ఆవశ్యకత ఎంతైనాయున్నది.

గౌరిగా కృష్ణకుమారి, మల్లిఖార్జునుడుగా అమరనాథ్, బసవయ్యగా సి. యస్. ఆర్. సమర్థంగా నటించారు. R. నాగేశ్వరరావు యొక్క విలన్ గా నటనా కౌశలం చూచి ఉత్తమనటుడు పోయాడు కదా యనుకోనివారుండరు. సరసాంగిగా గిరిజ చాల చక్కగా నటించి మెప్పించింది. హాస్యము, నృత్య సన్నివేశాలు ఉన్నతస్థాయిలో నమరినవి. సంగీతము మనోరంజకంగానున్నది. ట్రిక్ ఫొటోగ్రాఫీ సామాన్య ప్రజలను విశేషముగా నాకర్షింపగలదు.

ప్రజా సామాన్యాన్ని సంతృప్తులుగా చేయ అన్ని హంగులుగల చిత్రమగుటచే విజయయాత్ర చేయగలదని గంటాపథంగా చెప్పవచ్చును.

మాటలు, పాటలు బాగున్నవి.

— పున్నయ్య



# సంపాదకీయములు

## వరకట్న నిషేధ బిల్లు

ఈ బిల్లుకు రాజ్యసభ చేసిన సవరణలను లోకసభ తిరస్కరించుటచే చట్టమగుటకు ఆలస్యమయి పార్లమెంటు సమిష్టి సమావేశములో ఓటింగ్ తీసికొనవలసిన అవసరం ఏర్పడింది.

ఈ సవరణలలో మొదటిది వరకట్నం నిర్వచనం. రెండవది కట్నములు కోరేవారిని, పుచ్చుకున్న వారిని, ప్రోత్సహించేవారిని శిక్షార్హులుగా చేయరాదనేది. కొందరు సభ్యులు సూచించినట్లు యీ సవరణలనే అంగీకరించినచో వరకట్నాల బిల్లు నిరుపయోగమైనది కాగలదు. వివాహసమయములందు ఆడపిల్లలకు నగల రూపంలో, వస్త్రములు, వాహనముల రూపంలో తల్లిదండ్రులు యివ్వదలచుకున్నవానిని బిల్లు నిషేధించుటలేదు. అయితే బలవంతంగా కట్నములు గుంజాలనిగాని, ఒత్తిడి పరిస్థితులలో కట్నములివ్వ సంకల్పించినవారిని గాని, కట్నాలను స్థిమితమున్నా లేకపోయినా ఆడపిల్లల తల్లిదండ్రులనుండి కట్నాలను యిప్పించడానికి ప్రయత్నించువారినిగాని శిక్షార్హులుగా చేయాలనే నిబంధనే లేకపోయినచో యీ బిల్లు చట్టంగా రూపొందినా ప్రజలకు జరుగగల మేలు శూన్యం. వరకట్నాల పిశాచము బారినుండి ప్రజలను యీ చట్టం రక్షింపకలుగాలి!

## ఆహారపదార్థాలలో కల్తీ

వెన్న, నెయ్యి, పాలు, నూనెలాంటి ఆహారపదార్థాలలో కల్తీ ముఖ్యంగా పట్నవాసాలలో బాగా పెచ్చుపెరిగిపోయింది. ఆహారపదార్థాల ధరలు విపరీతంగా పెరిగిపోవుటతోబాటు కల్తీకూడ అధికం కావడం శోచనీయము. పట్నవాసాలలో ప్రజారోగ్యంలో లోటుపాట్లకు కల్తీ ఒక ప్రధానకారణం. దానిని నిరోధించడానికి చట్టం మరింత కట్టుదిట్టంగా అమలు జరగాలి! గ్రామాలలోకి సయితము వ్యాపిస్తున్న కల్తీ విధానము ప్రజారోగ్యదృష్ట్యా అవాంఛనీయమైనది.

## వృక్షసంపద

చింతచెట్లను వంటచెరకుగా నరికివేయకుండా ఆంక్ష విధించాలని ఆంధ్రప్రభుత్వము ఆలోచిస్తున్నదట. ప్రస్తుతము పెచ్చుపెరిగిపోతున్న చింతపండుధర దృష్ట్యా యీ ఆంక్ష అవసరమేమో! ఆహారపానీయాల లాంటి జీవితావసరములను సమకూర్చే వృక్షములను నరికివేయడం తగదు. వంటచెరకుకు చౌకకర్ర, అడవి కర్ర యిత్యాదుల వాడకం విస్తృతం చేయనగును.




Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor: C. C. Punniah.
Proprietors: Kesari Kuteeram (Private) Ltd.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10 6 ఔ॥ రు. 5-50

## క్షీరబలాతైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

# కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్, మైసూరుకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు. బెజవాడ - సికిందరాబాదు, బెంగుళూరు




# 57 ఏళ్లగా ఖ్యాతి గాంచినది.

లోధ్రలో హానికరమైన వేవీ లేవు. సుఖప్రదమైన జీవితానికి ఆరోగ్యాన్ని చేకూర్చడానికి అది గట్టి మందు. కెమిష్టు లందరి వద్ద దొరుకుతుంది.

లోధ్ర స్త్రీల దివ్యౌషధం,

**కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.**
**రాయపేట - మదరాసు - 14.**









ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సాకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ & సికిందరాబాద్, బరంపురం

LODHRA PRESS, MADRAS-14.